"హార్లిక్స్ నా ఆరోగ్యభీమా అంటుంది సుచిత్ర.
"నా కుటుంబాన్ని శ్రద్ధగా కాపాడేందుకు యిది బాగా సహాయ పడుతుంది."





**రోగ నిరోధక శక్తిని కల్గించి నిత్యం ఆరోగ్యం కాపాడుతుంది.**

తన కుటుంబాన్ని యింటినీ జాగ్రత్తగా చూసుకోవటంలో సుచిత్ర ఆనందం అనుభవిస్తుంది. తన పనినంతటినీ చేసుకునే శక్తిని కల్గించేందుకు ఆమె రోజూ బలవర్ధక ఆహారం 'హార్లిక్స్' తీసుకుంటుంది.

జీవనాధార మాంసకృత్తులతోనూ, రోగనిరోధక శక్తిని, బలాన్ని యిచ్చే పోషకాహార పదార్థాలతోనూ, 'హార్లిక్స్'ని తయారు చేశారు.

అందుచేతనే 100 ఏళ్ళుగా తల్లులూ, డాక్టర్లూ హార్లిక్స్‌ని నమ్ముకున్నారు.

**"నేనెరిగిన ఆరోగ్యవంతమైన కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయి.**

సహజమైన మాంసకృత్తులూ, కార్బోహైడ్రేట్లూ, ఖనిజాలూ, విటమిన్లతో హార్లిక్స్‌ని ప్రత్యేకంగా తయారు చేశారు. ఇది రోగ నిరోధక శక్తిని కల్గించి, మిమ్మల్ని మంచి ఆరోగ్యంగా వుంచుతుంది."






HMM 3377 (1) TEL

**దీనిలో ఆరోగ్యముంది**
# హార్లిక్స్
**మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టర్డు ట్రేడ్ మార్కు

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 16–5–'75
రాక్షసనామ సం. వైశాఖమాస శు. పంచమి
సంపుటము : 68 సంచిక : 35

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 33–80 పై.
ఆరుమాసాల చందా – రు. 16–90 పై.
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
అమితాబ్ బచ్చన్
(ఫొటో : మధురవిఠల్)



# ★★★ అంతరిక్షంలో ఆర్యభట్ ★★★

***భారతదేశం కూడా ఏప్రియల్ 19వ తేదీనాడు ఓ 'బుల్లి చందమామ'ని ఐదుకోట్ల రూపాయల వ్యయంతో సొంతంగా తయారుచేసి ఆకాశంలోకి రష్యానుంచి ఎగరేసింది...***

అయిదో శతాబ్దంలో (క్రీ. శ. 476) పేర్గాంచిన ఖగోళశాస్త్రవేత్త 'ఆర్యభట్టు' గారు భూమ్మీద నుంచే 'గణింతాలు' చేసి ఎన్నో రోదసీ విశేషాలను అంచనా కట్టాడని చరిత్ర! ఆయన, పేరుమీద యిప్పుడు ఆకాశంలో భూమికి ఆరువందల కిలోమీటర్ల దూరంలో భూమి చుట్టూ తిరుగుతూవున్న చిన్న కృత్రిమ ఉపగ్రహం అక్కడనుంచి శాస్త్రీయ సమాచారాన్ని సంకేతాలద్వారా పంపిస్తున్నది. ఈ సంకేతాలను మన రాష్ట్రంలో నెల్లూరు జిల్లాలో నెలకొని వున్న రోదసీ కేంద్రం అందుకుని అర్జంటుగా 'మదింపు' చేసి బెంగుళూరులోగల రోదసీ శాస్త్ర పరిశోధన సంస్థకు పంపిస్తున్నది!

సంబరాలు చేశారు. ఇప్పుడు సగటు మనిషి జీవితాన్ని ఏ పిసరు మార్చలేని యీ 'ఉపగ్రహ యాత్ర'కు అంత ఉత్తేజోల్లాసాలు కలగకపోటానికి కారణం—ఈ విషయాలను మొదటి నుంచి సామాన్యులకు కుతూహలం కలిగించే విగా చెప్పకపోవటమే!

### పునాది మాత్రమే!

అంతర్జాతీయ రంగ ప్రతిష్ఠ 1974 మే 18 నాటి 'మెట్టు' నుంచి 1975 ఏప్రియల్ 19కి మరో మెట్టుకు ఎగబాకిందని ఒప్పుకోవాలి అయితే 'ఆర్యభట్' ప్రయోగం రష్యలోని ఒకానొక 'కాస్మోడోమ్' (రాకెట్‌ల స్టేషన్) నుంచి జరిగింది. రైలు బండీ పెట్టెలు మనవేగాని యింజను, ప్రయోగించాలన్న ఏర్పాటు; ఢిల్లీ మాస్కోల మధ్య 1972లోనే జరిగింది.

### స్వరూప స్వభావాలు

మనవాళ్లు భూమి చుట్టూరా తిరిగేటందుకు పంపించిన యీ ఉపగ్రహం యిప్పుడు పంపుతున్న సంకేతాలు ఆరు మాసాలుదాకా పంపిస్తుందని అంచనా...

దీని స్వరూప స్వభాలకి చెందిన కొన్ని వివరాలు యిలా ఉన్నాయి. ఆర్యభట్‌ను చేయటానికి 30 మాసాలు పట్టింది. దీని బరువు మూడువందల కిలోలు. భూమికి ఆరువందల పందొమ్మిది కిలోమీటర్లనుంచి ఐదువందల అరవైమూడు కిలోమీటర్ల దూరంలో యిది పరిభ్రమిస్తున్నది. ఇదివరలోనూ

#### అంతరిక్షానికి మైలురాళ్లు

★ 1961 : రోదసీ పరిశోధనల భారాన్ని 'అణుశక్తి శాఖ' తీసుకున్నది.

★ 1962: డా. విక్రమ్ సారాభాయిగారి ఆధ్వర్యంలో రోదసీ పరిశోధనా సంఘం ఒకటి ఏర్పడినది. అదే యేడు 'తుంబా' (త్రివేండ్రం దగ్గర) రాకెట్ ప్రయోగశాల ఏర్పాటైంది. దీనికి ఫ్రాన్స్, అమెరికా రష్యాల సహాయం లభించింది.

★ 1965 : త్రివేండ్రంలో భారతదేశం మొట్టమొదటి రోదసీ శాస్త్ర సాంకేతిక విషయ పరిశోధనాలయాన్ని నెలకొల్పింది.

★ 1969 : రోదసీ పరిశోధనకై ఒక వ్యవస్థను ఏర్పాటు చేశారు. ఈ శాఖ అణుశక్తిశాఖలోఅంతర్భాగంగా వుంటూనే పనిచేస్తున్నది. 'రాకెట్'లను ప్రయోగించేటందుకు అవసరమైన ఇంధనాన్ని తయారుచేసే కర్మాగారం నెలకొల్పారు.



ఆర్యభట

భారతదేశం కృత్రిమ ఉపగ్రహం చేయడం 'శ్రీహరికోట,' అనే రోదసీ కేంద్రం వుండటం సంకేతాలందటం-యిదంతా మామూలు మనిషికి కొంత తికమకగా వింతగా వుండొచ్చును. దానిక్కారణం మన దేశంలో ప్రభుత్వం, వారి సమాచార యంత్రాంగం పత్రికలు, ప్రజలుకూడా రాజకీయాలకిచ్చే టంత ప్రాధాన్యత యితర సాంకేతిక రంగాలకు వారలకు యివ్వక పోడమే.

## అణుబాంబ్ నుంచి అంతరిక్షానికి

ఇంకా ఏడాదవలేదు మే 1974 లో మొదటిసారి మనదేశంలోకూడా ఓ చిన్న అటమ్ బాంబ్ మనవాళ్లు ప్రేల్చారు. ఆ చప్పుడు విన్నట్లే ప్రజలంతా, హర్షాతిరేకంతో పట్టాలు వాళ్లవి అన్నమాట. 1978 నాటికి ఈమాదిరి కృత్రిమ ఉపగ్రహాన్ని ముక్కున కరచుకొని శ్రీహరికోటనుంచి అంతరిక్షంలోకి దూసుకుపోయి అక్కడ వాటిని ఒక కక్ష్యలో వదిలేసే రాకెట్లు తయారు కాగలవని మన శాస్త్రకారుల అంచనా. నిజంగా ఆ రోజు రాగలదన్న 'ఆశ'కు యిది పునాది మాత్రమే!

## మనవాళ్ళ ప్రతిభ

'ఆర్యభట్'ను రూపొందింపటంలో 250 మంది మన సైంటిస్టులు పనిచేశారు. [బ్రెయిన్ డ్రెయిన్‌లో పోయినవాళ్లు చాలా మంది. ఇప్పటికైనా వాళ్లని అరకరాదా?...] దీన్ని మార్చి 17 నాడు పూర్తి చేసి యిక్కణ్నుంచి రష్యాకి తీసుకువెళ్లారు. ఇట్లా దీన్ని తీసుకుపోయి మాస్కో సమీపంనుంచి

తిరుగుతూ, భూమిచుట్టూరా సెకన్‌కి 8 కిలోమీటర్ల వేగంతో తిరుగుతున్నది అంటే ఓసారి భూప్రదక్షిణం చేయటానికి 96 నిమిషాల యిరవై సెకన్లు తీసుకుంటుంది.

దీనికి [వజ్రంలాగ] యిరవై ఆరు మొహాలున్నాయి. నీలం, వూదారంగులు కంబోతగా వున్నది. ఎంతో పెద్దదికాదు పొడవు 160 సెంటి మీటర్లు. వెడల్పు 147 సెంటిమీటర్లు. ఎత్తు 116 సెంటి మీటర్లు. నిమిషానికి తొంభైచుట్లు యిది తనలోతాను తిరుగుతుంది. ఇట్లా తిరగ టానికి దీనిమీద వాయుపదార్థపు పేటికలు వుంచి ఏర్పాటు చేశారు. ఈ వాయుపదార్థం పెట్టెలు ఖాళీ అయిపోవటంతో యీ ఉప గ్రహం తన నిర్విరామ పరిభ్రమణం మానే యొచ్చును...

దీనిమీద 'సౌరఘటమాల' ఏర్పాటుంది. సూర్యుని కిరణాలు దీనిమీద పడ్డంతసేపు యిది దాన్ని విద్యుచ్ఛక్తిగా మార్చుకుని, దాని సహాయంతో భూమ్మీదకి ఎక్స్ కిరణాలు, గామాకిరణాలు యింకా రేడియో తరంగాల వాడకానికి అయనావరణానికి సంబంధించి అంతరిక్షంలోగల కష్టనష్టాల వివరాలు ప్రసారం చేస్తూంటుంది.

భూమికి అవతలి తట్టుకుపోయి నీడలో పడిపోయినప్పుడు తప్ప దీని 'సోలార్ బ్యాటరీలు' పనిచేస్తూంటాయి.

వెనుకబడ్డ దేశాలలో అగ్రగాంబూలం నాదంటూ ఎన్నో సందర్భాల్లో వచ్చే మన దేశం పోయి నేడు ది అటమ్ బాంబ్‌ను యీ ఏడాది కృత్రిమ ఉపగ్రహాన్ని సాధించింది అంటే ముందుకు పోతున్న దేశాల వరసలో కూడా దబాయించి మరీ చోటుచేసుకుం

★ 1971: ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరు జిల్లాలో 12,000 హెక్టార్ల జాగాలో మున్ముందు రాకెట్ల సహాయంతో ఉప గ్రహాలు ప్రయోగించే సాంకేతిక పరిశోధన ప్రయోగశాలల నిర్మాణం ప్రారంభ మైంది. [దురదృష్టవశాత్తు డా. విక్రమ్ సారాభాయ్ హఠాన్మరణం చెందింది కూడా యీ ఏడాదే]

★ 1973: రాకెట్ యింధన నిర్మాణ కర్మాగారం త్రివేండ్రంలో నెలకొన్నది. శ్రీహరి కోటనుంచి తొలి పెద్ద 'రాకెట్' రోహిణి ప్రయోగం జరిగింది.

★ 1975 మార్చి 17: భారత తొలి కృత్రిమ ఉపగ్రహం తయారై మాస్కోకి చివరి తనిఖీ నిమిత్తం తీసుకెళ్లారు. ఏప్రియల్ 19, 1975 అందరికీ తెలిసిందే.

టుందన్న మాట! ఈ వైవిధ్యం మనకి తప్ప ఇంకెవరికుంది?

నిజంగా యావద్భారతం ఒక్క గొంతుతో మన శాస్త్రవేత్తలకు జేజేలు చెప్పి ఏప్రియల్ 19ని ఏటా మన దేశంలో రోదసీ దినోత్సవంగా పరిగ ణించే 'బంగారుమైలురాయి' యిదే! ''ఆర్యభట్'' కారులందరికి జే జేలు! జే జేలు!

[ పిరాజీ ]

## హైదరాబాద్ నోట్ బుక్

# ప్రపంచ తెలుగు మహాసభలు

ప్రపంచంలోని తెలుగు వారిని ఒకచోటికి తెచ్చి, వారిలో భావసమైక్యాన్ని కలిగించి వారి పరస్పర సౌహార్ద సౌమనస్య భావాలను పెంపొందింప చేయాలనే సత్సంకల్పంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముఖ్యంగా డాక్టర్ గోపాలరెడ్డి అన్నట్టు కృష్ణార్జునులు, నరనారాయణులువంటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు తలపెట్టిన ప్రపంచ తెలుగు మహాసభలు జంటనగరాలలో అపూర్వమయిన, అనిదంపూర్వమైన ఉత్సాహాతిరేకాన్ని కలిగించి, శాశ్వత స్నేహముద్రను గంభీరంగా, గాఢంగా వేశాయని చెప్పడంలో అతిశయోక్తి ఉండదు. రాక్షస ఉగాదినుంచి వారంరోజులపాటు తెలుగుకళలు, తెలుగుచరిత్ర, తెలుగుభాష, తెలుగు సంస్కృతి వేయి విధాలుగా సాకారమై జంటనగరాల పౌరుల ఎదుట ప్రత్యక్షమై వారి మనసును, హృదయాన్ని, బుద్ధిని ఆనందతుందిలం చేశాయి. జనం నేల ఈనినట్టు ఆకాశంనుంచి ఊడిపడినట్టు మహావాహినిగా వచ్చి, గోష్ఠులలో పాల్గొన్నారు. మహాసభలను అలంకరించారు, సాంస్కృతికోత్సవాలను తిలకించారు.

నగరం నట్టనడుమన ఉన్న లాల్ బహదూర్ స్టేడియం కాకతీయనగర్‌గా మారింది. దానికి ఇరువైపులా రెండు కాకతీయ ద్వార తోరణాలు నిర్మింపబడినాయి. ఇవికాక సాంస్కృతిక కార్యక్రమమూ మహాసభలు జరిగిన ప్రాంతంలో ప్రవేశించడానికి ఏడుద్వారాలు పెట్టబడ్డాయి. వాటికి నన్నయద్వారం, పోతనద్వారం, పెద్దన ద్వారం, కవయిత్రి మొల్లద్వారం, వేమనద్వారం, భక్తరామదాస ద్వారం, సరోజినీనాయుడు ద్వారం అని పేర్లు పెట్టారు. గ్యాలరీలలో కూర్చున్న వారికి రంగస్థలంమీది నృత్య నాటక ప్రదర్శనలు స్పష్టంగా కనిపించడానికి 77 టెలివిజన్ సెట్లు అమర్చడం ఎంతో మేలయింది. ప్రేక్షకులు నిశ్చింతగా తెల్లవార్లూ నృత్య నాటకాదులు తిలకించితనిశారు. కాకతీయనగర్‌కు వెళ్ళే అన్ని మార్గాలలోను సుందరమైన తోరణాలు నిర్మించారు. స్టేడియంలోపల 47 మంది ఆంధ్ర ప్రముఖుల కటవుట్ చిత్రాలు జనాన్ని గొప్పగా ఆకర్షించాయి.

ఫతేమైదాన్‌లో స్టేడియం వెనుకన వున్న బయలులో గోష్ఠులు, సదస్సుల నిమిత్తం పెద్ద శామియానా వేయబడింది. దీనికి నాగార్జున పీఠం అని నామకరణం చేశారు. ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో ఏర్పాటు చేయబడిన 'నవ తరాల తెలుగుజాతి వైభవం' ప్రదర్శనం గొప్ప ఆకర్షణ. దీనిలో తెలుగు దేశంలోని ప్రముఖ చిత్రకారులు, శిల్పులు పాల్గొన్నారు. దీని మనోహరంగా రూపొందించారు. సాంస్కృతిక కార్యకలాపాలలో 1300 మందికళాకారులు పాల్గొన్నారు. చలనచిత్రోత్సవం జరిగింది. దీనిని ఏప్రిల్ 11 వ తేదీన ప్రఖ్యాత దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి ప్రారంభించారు. లిబర్టీ, స్కైల్యాండు థియేటర్లలో మహాసభ ప్రతినిధులకు తెలుగు చిత్రాలు చూపబడినాయి.

12 వ తేదీ ఉదయం కాకతీయనగర్‌లో ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు పతాకావిష్కరణ జరిపిన పిదప ప్రత్యేక తపాలా బిళ్ళను పోస్ట్ మాస్టర్ జనరల్ శ్రీ పి. ఎస్. రామాచారి స్వాగత వచనాల తర్వాత ముఖ్యమంత్రి విడుదలచేశారు.

'వివిధ ప్రాంతాల్లో తెలుగువారు' అన్న గోష్ఠిలో పాల్గొన్న మహిళలు, ఉపన్యాసం చేస్తున్న టంగుటూరి సూర్యకుమారి.

(దిగువ) సినిమా ఉత్సవాలను ప్రారంభిస్తున్న కేంద్రమంత్రి ఐ.కె. గుజ్రాల్.



# ఈ వేసవిలో ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది ?

ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు బుజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది.
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది.

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే ఔషధీయుక్తమైన పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనము కల్గించేది—తక్షణము.

నుదురు

చేతులు

వీపు




చందనపు సువాసనలో కూడా దొరుకుతుంది.

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson*

# హైదరాబాద్ నోట్‌బుక్

ండప్పలో తరతరాల తెలుగుజాతి కేంద్ర దేశీయాంగ మంత్రి బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం జరుప వలసింది కాని, ఆయన రాలేకపోయినందున ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు, లాంఛనంగా ప్రారంభించారు. ఈ సందర్భంగా చిత్రకారు లకు సన్మానం చేయడం జరిగింది.

12 వ తేదీ సాయంకాలం ఇదివరకు జంటనగ రాలు కనివిని ఎరుగని బ్రహ్మాండమైన వూరే గింపు చార్‌మినార్‌నుంచి బయలుదేరి, కాకతీయ నగర్ చేరింది. వూరేగింపు తర్వాత ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జెట్టి మహాసభను ప్రారంభిస్తూ, సంప్రదాయ శృంఖలాలతో జడప్రాయమైన సమా జాన్ని చైతన్యవంతంచేసి ముందుకు నడిపించడం తెలుగు రచయితల కర్తవ్యమని, ప్రపంచంలోని తెలుగువారి సమైక్యం భారత సమైక్యాన్ని పటిష్టం చేస్తుందని అన్నారు. ఆయన తనకు తెలుగు అర్థమవుతుందని చెబుతూ, తెలుగు ప్రసంగం వ్రాసుకొనివచ్చి చదివారు అధ్యక్షత వహించిన శ్రీ వెంగళరావు తెలుగు భాషకు సముచితస్థానం కల్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం కృతనిశ్చయంతో ఉందన్నారు.

ఈ మహాసభల సందర్భంగా ప్రచురించిన 56 గ్రంథాలను శ్రీ దేవులపల్లి రామానుజరావు సమర్పించగా, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆవిష్కరిస్తూ, దేశవిదేశాలనుంచి వచ్చిన వారికి వాటిని సమర్పిస్తున్నానన్నారు. "ఇక్కడ లక్షలాది జనం నేడు ఇక్కడ సమావేశం కావడం తెలుగు తల్లిని ఆరాధించడంకోసం, అభిషేకంచేసి, అనియడంకోసం తమ హృదయాలను అర్పించడం కోసం" అని తన్మయత్వంతో అంటూ, ప్రసంగ చాతురిలో ఇతరులను మించిపోయారు. ప్రత్యేక సంచికను, శ్రీ వి. పి. రాఘవాచారి సమర్పించగా ఉత్తరప్రదేశ్ గవర్నరు డాక్టర్ చెన్నారెడ్డి ఆవి ష్కరిస్తూ, తెలుగు ప్రజల భావసమైక్యం శాశ్వతం కావడానికి చర్యలు తీసుకోవాలన్నారు. మహాసభలకు వచ్చిన దాదాపు 80 మంది విదే శీయ తెలుగు ప్రతినిధులు పక్షాన మాట్లాడిన వారిలో శ్రీలంక ప్రతినిధి శ్రీమతి మీనాక్షి పొన్ను దొరై శ్రోతలను విశేషంగా ఆకర్షించారు. ఆమె తన హృదయాన్ని శ్రోతల ఎదుట కుమ్మరించా రనిపించింది. మహాసభలు కుమారి టంగుటూరి సూర్యకుమారి పాడిన "మా తెలుగు తల్లికీ మల్లెపూదండ" పాటతో ప్రారంభం కావడం, ఆ పాట వ్రాసిన శ్రీ శంకరంబండి సుందరా చారిని ప్రభుత్వం సన్మానించడం ప్రశంసనీయ విషయాలు.

వివిధ రంగాలలో ప్రముఖులయిన దాదాపు 200 మందిని ప్రభుత్వం వారంరోజులపాటు శాలువ, ప్రత్యేక ఫలకం, బీప్ కేసులతో సత్క రించడం ఉత్సవాల ప్రత్యేకత.

ఉదయం గోష్ఠులు, సాయంకాలం సాంస్కృ తిక కార్యక్రమాలు జరిగాయి. 16 వ తేదీన మాజీరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్, మాజీ గవర్నర్ శ్రీ ఖండూభాయి దేశాయి అస్తమించడం వల్ల 17 వ తేదీ జరుగవలసిన కార్యక్రమ మంతా 18 న కలిపివేయబడడంవల్ల జనం తొక్కిడి ఎక్కువయింది. 17 న మహాసభ అస్తమించిన ఇరువురికీ శ్రద్ధాంజలి ఘటించింది.

18 వ తేదీన సమాప్త్యుత్సవంలో రాష్ట్ర పతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమద్ ప్రసంగిస్తూ, ప్రజల హృదయాలలో ఉదాత్తభావస్ఫూర్తిని సృష్టించడమే సాహిత్యపరమావధి అన్నారు. రాష్ట్రమంత్రి శ్రీ కె. వి. కేశవులు కృతజ్ఞ తతో జనగణమన గానంతో మహాసభోత్సవాలు సమాప్తమైనవి, కాని అది ప్రారంభించిన సమైక్య భావతరంగాలు మాత్రం నిరంతరం అనురణిస్తూ, తెలుగువారి హృదయాలలో ప్రతి ధ్వనిస్తూ, హృదయ స్పందనతోపాటు స్పందిస్తూ వుంటాయి.

**డాక్టర్ యశోదారెడ్డికి సన్మానం:**

రాక్షస ఉగాది ఉత్సవాల సందర్భంగా ఏప్రిల్ 11 న రిజర్వు బ్యాంకి హైదరాబాదు శాఖ తెలుగు సమితివారు సుప్రసిద్ధ విదుషీమణి డాక్టర్ యశోదారెడ్డిని సన్మానించారు. ఈ సన్మాన సభకు శ్రీ తిరుమల రామచంద్ర అధ్యక్షత వహిం చారు. శ్రీ టి. రామదాసు ప్రార్థనానంతరం శ్రీ కె. ఎస్. ప్రసాద్ స్వాగత పత్ర సమర్పణా నిదప, డాక్టర్ యశోదారెడ్డికి కాశ్మీరు శాలువ సమర్పింపబడి, సత్కారం జరిగింది. అధ్యక్షుడు శ్రీ తిరుమల రామచంద్ర డాక్టర్ యశోదారెడ్డి గొప్ప విదుషి అని, వక్త అని, ఆమె భర్త శ్రీ పి. టి. రెడ్డి గొప్ప చిత్రకారుడని ప్రశంసించారు. డాక్టర్ యశోదారెడ్డి ప్రసంగిస్తూ, ఈ సంవత్సరం మహిళా సంవత్సరం గనుక మహిళల ప్రాధాన్యం గురించి ప్రసంగించారు. శ్రీ శంకరం బండి సుందరాచారి తమ కవితానుభవాలను గురించి ప్రసంగించారు. శ్రీ సి. పాండురంగమూర్తి వందన సమర్పణతో, వినోద కార్యక్రమంతో సన్మాన సభ సమాప్తమైనది.

**ఉపశ్రుతి:**

"ఏమిటి సార్, మంత్రిగారికి సంఘ కార్య దర్శి వందన సమర్పణ చేశారు అని వార్త పడ్డది చూచారా?" అన్నారు నాతో ఒక సంఘ కార్యదర్శి "అయ్యా అది ముద్రారాక్షసం. వందన సమర్పణ అనడానికి వంద సమర్పణ అని పడింది." అన్నాడు పక్కనున్న ముద్రాక్షర శాల యజమాని.

—తిరుమల రామచంద్ర



హైదరాబాదులోని కాకతీయనగర్‌లో విజయ వంతంగా జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో ఏప్రిల్ 18 వ తేదీన రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ వీడ్కోలు ఉపన్యాసం యిస్తున్న దృశ్యం. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు, గవర్నర్ శ్రీ ఓబుల్‌రెడ్డి, జమ్మూ కాశ్మీర్ ముఖ్యమంత్రి షేక్ అబ్దుల్లా, ఉత్తరప్రదేశ్ గవర్నర్ డాక్టర్ చెన్నారెడ్డి, ఒరిస్సా గవర్నర్ శ్రీ అక్బర్ అలీఖాన్, విద్యామంత్రి శ్రీ మం. వెం. కృష్ణారావుగార్లని కూడా చిత్రంలో చూడవచ్చు.

# పెరిగే వయస్సు ఆరోగ్యవంతముగా అవుతుంది ఇన్‌క్రిమిన్*తో



బాల్యదశ రోజులు : శీఘ్రవృద్ధితో
పెరిగే రోజులు! ఈ రోజుల్లో పిల్లల శరీరం
చురుకుగా వికసిస్తుంది. వీరికి ఇన్‌క్రిమిన్
సిరప్ తప్పక ఇవ్వండి. ఇది చూడండి
ఆహారము తినకుండా మారాము చేసే పిల్లల
ఆకలి ఎంత పెరుగుతుందో— వీరు తినే, బాగా
ఆహారమంతా కూడా వంటికి బాగా
పట్టుతుంది. లాభదాయకమైన
మరియు ఐరన్‌తో పరిపూర్ణమైన విటమిన్లు
ఇన్‌క్రిమిన్‌లో, ఆహారము యొక్క అన్ని
పోషక తత్వములను గ్రహించేందుకు
సహాయము చేసే విశేషమైన అమినో ఏసిడ్,
లైసిన్ కూడా ఉన్నాయి.




## ఇన్‌క్రిమిన్* టానిక్

డ్రాప్స్— శిశువులకు 2 నెలల నుంచి 2 సంవత్సరాల వరకు
సిరప్— 14 సంవత్సరముల వయస్సు వరకు పిల్లలకు

**అధిక ఆహారాన్ని అధిక పెరుగుదలగా మారుస్తుంది తింటున్న ఆహారమంతా వంటికి పట్టేట్టు చేస్తుంది**

డాక్టర్లు విశ్వసించే పేరు— Lederle
సయానమిడ్ ఇండియా లిమిటెడ్ వారి ఒక విభాగం *అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

"ఏమంటావ్" ... అంది సుందరమ్మ, బయటకు వెళ్లబోతున్న రాంబాబుతో!

రాంబాబు ఆగి, తల్లి వైపు చిరాగ్గా చూశాడు. "మొదటే చెప్పానుగా. ఇంకెన్ని సార్లు చెప్పాలి!" అన్నాడు.

''అదికాదురా ... వాళ్లు బాగా కలిగిన వాళ్లు...ఒక్కతే కూతురు. సాంప్రదాయం. మర్యాద ...'' అంటూ సుందరమ్మ ఏదో చెప్పబోయింది.

రాంబాబు వారించాడు...''సాంప్రదాయం, మర్యాద అనేవి వాళ్లకే కాదమ్మా. అందరికీ ఉంది. ఎవరో ముక్కూ మొహం తెలీని ఓ అమ్మాయిని ఇట్టే చూసి, అట్లే నిర్ణయానికి వచ్చేయటం...ఐ డోంట్ లైక్! నేను అమ్మాయిని చూడాలి. పరిచయం చేసుకోవాలి. ఒకరి నొకరు బాగా అర్థం చేసుకోవాలి. అప్పుడు, అన్నీ కుదిరితే, పెళ్లి వరకూ వెళ్లొచ్చు...'' అన్నాడు.

''బాగానే ఉంది వరస. మా కాలంలో ఇలానే జరిగాయా? మేం మాత్రం సలక్షణంగా లేమా? తలితండ్రుల చాటున పెరిగిన ఏ ఆడపిల్లయినా ఒకటే. నామాట విను...'' అంది సుందరమ్మ, కొడుక్కి నచ్చచెప్పే ధోరణిలో!

''మీ తరానికి, ఇప్పటికి కంపేర్ చెయ్యకు. అసలు మీ చిన్నప్పుడు ఈ కరెంటు దీపాలున్నాయా? లేవు. అందుకే ఆవదం దీపాలు పెట్టుకొని, మసిబారిన ఆలోచనలతో మీ బ్రతుకులు వెళ్లబారిపోయాయి! అమ్మా...వివాహమనేది వ్యక్తిగత విషయం. దేర్‌ఫోర్...నా విషయంలో నువ్వేం కంగారు పడకు. ప్రేమించిగాని పెళ్లి చేసుకోను. ఇది నా శపథం...'' రాంబాబు ధృఢంగా, కాలరు పైకి ఎగదోసి మరీ అన్నాడు.

''అయితే ప్రేమించి తీరాలంటావ్?'' అంటూ అడిగారు, అప్పుడే రంగంలోనికి ప్రవేశించిన రాజారావుగారు.

ఇంతసేపు ప్రక్కగదిలో కూర్చొని, కుమారరత్నం ఇస్తున్న ఉపన్యాసాలు విని, చక్కాలేచి వచ్చారాయన.

''అంతే...'' అన్నాడు, రాంబాబు బింకంగా!

''శభం! అలానేకానీ! నీ మాట

వే మెందుకు కాదనాలి ?" అన్నారాయన.

సుందరమ్మ ఏదో చెప్పబోతే అడ్డుపడి అన్నారు "నీ ఆరాటం నాకు తెలుసులేవే! అయినా, వాడెదో ప్రేమిస్తాను మొర్రో అంటున్నాడుగా! నీకెందుకు, నువ్వూరుకో!"

తరువాత కొడుకువైపు తిరిగి "ఒరే అబ్బాయ్! నీ పెళ్ళి నీ యిష్టప్రకారమే జరుగుతుంది పెళ్లిచేసుకోవలసిన వాడివి నువ్వు కాబట్టి నీక్కాబోయే పెళ్లాన్ని ఎన్నుకునే స్వేచ్ఛ నీకుండాలనేదే నా అభిప్రాయం కూడా! కాబట్టి ఎవతినో తొందరగా ప్రేమించి, అదేదో మాకుచెప్తే ఆమూడు ముడులూ వేయించేస్తాను " అన్నారు

రాంబాబుకు తండ్రిమీద ఒక్కసారిగా విపరీతమైన గౌరవం కలిగింది. "థాంక్యూ, డాడీ థాంక్యూ వెరీమచ్ " అంటూ హుషారుగా బయటకు నడిచాడు.

*   *   *

రాంబాబు చెప్పినదంతా విని సత్యమూర్తి చప్పరించేశాడు, 'లాభంలేదు గురూ! ప్రేమ అనేది అనుకోకుండా కలిగే వికారం అంతేగాని అరబ్బీగుర్రాల్ని పరీక్షించినట్లు, అమ్మాయిల్ని పరీక్షించి ప్రేమించాలంటే. కించిత్ దేహశుద్ధి ప్రమాదాలున్నాయ్! అన్నాడు

రాంబాబు నీరుగారిపోయాడు

స్నేహితుని పరిస్థితిచూసి సత్యమూర్తికి జాలివేసింది "ప్రేమించటం అనేది కొంచెం కష్టమే అయినా, మరీఅంత కొరకరాని పనేంకాదు నీకంతగా ప్రేమించాలనేఉంటె రడీమేడ్ ప్రేయసి రడీగాఉంది మనస్సైనో మాణిక్యంలేదూ "

"ఎవరూ? ఆ దంత సుందరేనా ?" రాంబాబు గాభరాగా అన్నాడు!

"అంత గాభరా దేనికోయ్! మాణిక్యం ముందు పళ్లు దారితప్పి బయటకు పొడుచుకొని వస్తే వచ్చి వుండొచ్చుగాక అంతమాత్రానికే ఏమయింది మనిషి దంత బొమ్మే అనుకో! పైగా నువ్వేం ప్రేమ పాఠాలు నేర్పక్కర్లేదుకూడా! మాంచి ఎక్స్పీరియన్స్‌డ్ హాండ్! వీలయితే ఓ పట్టు పట్టు " అంటూ సలహా యిచ్చాడు!

"అంటే నీ అభిప్రాయం?" రాంబాబు తీక్షణంగా అన్నాడు

సత్యమూర్తి నవ్వాడు "సదుద్దేశమే! కం టు మై పాయింట్! ఓల్డ్ ఈజ్ గోల్డ్ అన్నారు కొత్త చిలకయితే నువ్వే మాటలు నేర్పి దారికి తెచ్చుకోవాలి! అదే కనుక మాటలు నేర్చిన చిలకయితే తిరిగి మనకే మాటలు నేర్పుతుంది ఇన్ని మాటలు దేనికి గాని నువ్వు గనుక మాణిక్యాన్ని ప్రేమిస్తే ప్రేమించాలనే నీ కోరిక నెరవేరుతుంది మాణిక్యానికి కన్నెచెర తప్పుతుంది మీ అమ్మకు కోడలు కావాలనే సరదా తీరుతుంది త్రీ యిన్ వన్ చూశావా మన అయిడియా?" అన్నాడు.

"ఏడ్చినట్లుంది.. నీ బోడి సలహా. " రాంబాబు కోపంగా అన్నాడు.

"అలా విశ్వామిత్రుడిలా మండిపడకు నాకు తోచిందేదో నేను చెప్పాను సలహా అడిగేవరకే నీవంతు ఎటువంటి సలహా యివ్వాలనేది నా యిష్టం " అన్నాడు సత్యమూర్తి!

"అసలు నిన్నడగటం నాదే బుద్ధితక్కువ పస్తా " విసురుగాలేచి బయటకు నడిచాడు రాంబాబు!

"మాణిక్యం విషయం మర్చిపోకు గురు " వెనుకనుండి సత్యమూర్తి కేక వినిపించింది

"డామిట్ " అనుకున్నాడు, కసిగా!

*   *   *

సినిమా చకచక సాగిపోతున్నాది

రాంబాబు కళ్లప్పగించి చూస్తున్నాడు. హీరో, హీరోయిన్ల ప్రేమ కలాపాలు, డ్యుయెట్లు, కౌగిలింతలు, దొర్లాటలు అరటిపండు తొక్కమీద కాలువేసి జారినంత సుతారంగా సర్రున సాగిపోతూంది సినిమా!

ఇంతలో తనమీద ఏదో పడినట్లయి ఉలిక్కి పడి చూశాడు, రాంబాబు!



## ప్రశ్నావళి

టి జె ఎస్. రాజమండ్రి.

ఈ మధ్య మీ సమాధానాలు చూస్తుంటే మీ కేమైనా స్వా(స్థ్యం) లూజయిందేమోననిపిస్తోంది

లూజేం కర్మసార్! మొన్న బెజవాడలో ఎక్కడో పడిపోయిందని నా అనుమానం!

జె ఎస్ వి జి. అనంతపురం

మీరు తరుచు మీ భర్తతో పోట్లాడుతూ ఉంటారని విన్నాం

ఏ నార్య భర్తతో పోట్లాడదండీ! మరీ చోద్యం గాని!

టి యు ఆర్ హైదరాబాదు

ప్రపంచంలో ఏ తగాదాలని పరిశీలించినా చివరికి ఒల్లాపోడట్లని కూడా—రెండు వైపులా తప్పు లేనిదే తగాయిదా రాదు

చిత్రం చేతులు కలిస్తేనే గదా చప్పట్లు!

డి ఆర్ తిరుపతి

మీ జవాబులు గర్వంగా ఉంటాయి పెడసరంగా ఉంటాయి అనే మగ మహానుభావులే ఎందుకు అడుగుతుంటారు

పొరపాటు సోదరీ, ఇలాంటి సంభ్యాలో మన జాతేం తీసిపోదు! ఇక తిట్టుకుంటూ— యిష్టమైనవాళ్లని అడగడమే మెరుగు మర్యాదగా యిష్టంలేని వారినడిగి వాళ్ళు చెప్పేదంతా దిగమింగేకంటే! ఏమంటారు?

ఇది ప్రేమా ద్వేషం అంటావా? అవి రెండు నాణానికి రెండు పక్కలు

ఎస్ ఎక్ ఎస్ సిద్దిపేట

ఆశకు అంతు ఉంటుందంటారా?

ఉండదు అంచులు కన్పిస్తాయి అప్పు డప్పుడు

కె ఎస్ ఆర్ చిరమల్లం

ప్రతి ఆఫీసులో మేము ఉన్నామని విర్రవీగే మీ స్త్రీల నేమనాలి యీ నిరుద్యోగం పెరిగిపోతున్న రోజుల్లో వీళ్లు ఉద్యోగాలుచెయ్యకపోతే ఎవరికి నష్టం?

మాకే—రాజాగారూ, ఏమిటి? స్త్రీజాతి తిండి తినడం మానేస్తే యీ కరువులు రావని అంటారా?

ఎస్ వి చిరు(ంచి)

పోట్లాడుతూ ముఖం పెడ చూస్తారు

అలా ముఖం చూసి పోట్లాడే వాళ్ళు నష్టాల్ని లోపించినవాళ్లు నిజాయితీ ... వాళ్లకి చెప్పడం దండగ వాళ్లని విసడం ఒండుగ

---

మృదువుగా, మెత్తగా, పల్చగా ఉంది

చీకట్లో కళ్ళు చికిలించి పరీక్షగా చూశాడు. చీరకొంగు.

ఆ చీర స్వంతదారయిన అమ్మాయి. తన కొంగు కాస్త పక్కనే కూర్చున్న చిన్నవాడి ఒడిలో వాలిందన్న విషయాన్ని గమనించనంత దీక్షగా సినిమాలో లీనమై పోయింది

రాంబాబు యిబ్బందిగా కదిలాడు ఆ అమ్మాయి కదల్లేదు

"ఎక్స్క్యూజ్‌మీ. మీచీర" చిన్నగా గొణిగాడు

జవాబులేదు

"ఏమండోయ్ మిమ్మల్నే" కొంచెం బిగ్గరగా పిలిచాడు

కొంచెంకదలి ఏమిటన్నట్లు చూసింది, చిరాగ్గా!

చీరకొంగుచూపించాడు.

'ఓస్ ఈమాత్రానికే అంత కంగారా' అన్నట్లు కొంగును విసురుగాలాగేసుకొని తిరిగి సినిమాలో లీనమైపోయింది ఆ చిన్నది

ఇంటర్వెల్‌లో ఆ అమ్మాయిని పరీక్షగా చూసిన రాంబాబు కొయ్యబారిపోయాడు మెరుపుతీగమెరసినట్లయింది

ఆ పిల్లమాత్రం రాంబాబును గమనించకుండా, పక్కనున్నావిడితో ఏదో మాట్లాడుతున్నాది

తిరిగి సినిమా మొదలైనా రాంబాబు మాత్రం స్థిమితంగాకూర్చోలేకపోయాడు

సినిమా అయిపోయిన తరువాత, ఆ అమ్మాయి వెళ్లిపోతున్నదల్లా వెక్కి తిరిగి రాంబాబువైపోకసారి ఆపాదమస్తకంచూసి, పక్కనున్నావిడతో కదలివెళ్లిపోయింది

* * *

ఆ మర్నాడు.

లేవగానే బాత్రూంలో దూరి చన్నీళ్ళు దిమ్మరించుకొని, తరువాత నింపాదిగా బ్రష్ మీద షేవింగ్‌క్రీంవేసి పళ్లుతోముకున్నపుడు రాజారావుగారు భోజనంచేస్తున్నప్పుడు చారు అన్నంలో మజ్జిగ పంపుకొని కలిపిగొట్టేస్తున్నప్పుడు, సుందరమ్మ, ఆఫీసులో మేనేజర్ని పట్టుకొని కాఫీ తెమ్మని డబ్బిచ్చి పురమాయించినపుడు సత్యమూర్తి— 'ఈరోజువీడి కేమైంది?' అంటూగాభరాపడ్డారు

"ఆమె నా హృదయం దోచుకుంది నేను ఆమెను ప్రేమించాను" అన్నాడు, సత్యమూర్తితో!

"ఎవరు? మాణిక్యమేనా?"

"జోకులు వెయ్యకు పళ్లు రాలగొట్టేస్తాను" రాంబాబు సీరియస్‌గా అన్నాడు

"అంటే మాణిక్యం కాదన్న మాట! అయితే ఎవరా అమ్మడు?"

"తెలీదు"

"తెలీదా?" అంటూ ఆశ్చర్యపోయి "ఈ విశాల విజయనగరంలో ఆమె ఎవరని, ఎక్కడ వుంటుందని వెతుకుతావు? తెనె అనుకొని ఆవదం తాగినట్లు నీకు పెళ్లయే యోగం లేదు ప్చ్." అంటూ జాలిపడ్డాడు, సత్యమూర్తి!

"నా ప్రేమే నన్ను ఆమె దగ్గరకు తీసుకొని వెళ్తుంది ఆమె కనిపించకపోతే తిన్నగా పెద్ద చెరువులో దూకేస్తాను" అన్నాడు రాంబాబు' దృఢంగా!

## ప్రేమించి చూడు

సత్యమూర్తి ఆశ్చర్యంగా చూసి లంపకించాడు

రాంబాబు పాలిట దేముడు కరుణించినట్లు ఆమె మర్నాడె కనిపించింది

రాంబాబు హుషారుగా ఆమెను సమీపించి "హలో" అంటూ పలకరించేశాడు, ఎంతోకాలంగా పరిచయమున్నట్లు!

ఆమె గాభరాపడి అంతలోనే సర్దుకొని సందిగ్ధంగా చూసింది

"నేనండీ గుర్తు పట్టలేదా? మొన్న సినిమాలో"

"ఏం సినిమాహాల్లో?"

"మీ పక్కనే కూర్చున్నాను" హుషారుగా చెప్పాడు

ఆమెముందు అర్థం కానట్లు చూసి, అంతలోనే గట్టిగా నవ్వింది

"ఎందుకు నవ్వుతున్నారు?" అడిగాడు, రాంబాబు!

"నవ్వొస్తే నవ్వక ఏడవమంటారా? ఎన్నో సినిమాలు చూస్తాం సినిమాలో పక్కన కూర్చున్న ప్రతి అడ్డమైన వాడినీ గుర్తుంచుకుంటూ పోతే ఎంతముందని?"

'ప్రతి అడ్డమైన వాడిని' అనే మాట వత్తి పలుకుతూ ఆమె మళ్లీ అంతలోనే పడిపడి నవ్వసాగింది

"అడ్డమైనవాడినా?" రాంబాబు నీరసంగా అన్నాడు

ఆమె నవ్వు ఆపుకుంది "కంగారు పడకండి మీరేం నిలువుగా, నిటారుగా భలే ఉన్నారు." అంది.

## — కె రామలక్ష్మి

**ఏ కె ఎస్ భువనగిరి**

ఒక వైపున రంభలాంటి యువతి రెండవ వైపున కుబేరుని వంటి ఐశ్వర్యాన్ని ప్రశ్నిక

కోరుడి కూకుర్నే పెళ్లాడండి ఇహ సుఖాలేనా దక్కుతాయి పరలోకంలో రంభ ఎలాగేనా దొరికేదే కదా

**పి ఎమ్ ఆర్ గుణుపూరు**

నిన్న నేడు రేపులతో మానవుడు సుఖ సంతోషాలు పొందేది ఎందులో—

వర్తమానంలో — నిన్నదేదో గడిచి పోయింది రేపేం స్టోరులో ఉందో తెలియదు ఇక వర్తమానమే— కదా మనకు తృప్తిని యిచ్చేది.

**డి. జి పి కాశీబుగ్గ**

ఇప్పుడున్నది ప్రజా రాజ్యమా ? నాయకుల రాజ్యమా ?

ముఠాల రాజ్యం

**బి కె ఆర్ నాగార్జునసాగర్**

ఉపన్యాసాల్లో వేదికలమీద ఎంత మాట్లాడే ప్రబుద్ధులు— తీరా అవసరం అయినప్పుడేం మాట్లాడరేం ?

తప్పు మీది సార్ అనవసరపు వాగుడు విని అది శక్తి అనుకుంటున్నారు వాగుడు దండగ రైలుబండిని లాగేది కూతకాదు కదా !!

**బి ఆర్ ఆర్ కర్నూలు**

మధువు కంటే మగువే మత్తు అయినదని అనుకోవాలా ?

ఉంగల్ విరుప్పమ్ ! మీ యిష్టం !

**బి వి కె ఆర్ గుంటూరు.**

మీ అభిమాన రచయిత్రి ఎవరో?

ఇంకెవరు రంగనాయకమ్మే

**కె. కె ఎమ్ సత్తెనూర్.**

ఒక స్త్రీకి కుంకుమ, గాజులు లేవు ఆమెను అడిగితే— న్యూ ఫ్యాషన్ అంది .

మీరెందుకు అడిగారు? కుంకుమ, గాజులు లేనంత మాత్రాన, పెట్టుకోనంత మాత్రాన హిందూ ధర్మ శాస్త్రాలని సంప్రదాయాలని మంట కలిపేసినట్టే బాధపడిపోయే— మీ తత్వం మార్చుకోండి సానుభూతితో యీ కాలపు తత్వాన్ని అర్థం చేసుకుందుకేనా ప్రయత్నించండి ఆమెగారు న్యూఫ్యాషన్ అంటేనే బాధపడిన మీరు— నాలాంటిదెవతో 'నా కిష్టంలేదు పెట్టుకోలేదు' అంటే ఏమవుతారు ?

---

రాంబాబు మనసు కుదుటపడింది

"ఇంతకూ మీ రెవరు ? ఎందుకిలా ఈ బొంకుల దిబ్బదగ్గర వంటరిగా 'అవారా'లా తిరుగుతున్నారు ? పాపం. మిమ్మల్ని చూస్తే జాలేస్తుంది" అంది, సానుభూతిగా !

"ప్రేమకోసం వెతుకుతున్నాను" అన్నాడు అన్నిటికి ఒకటే సమాధానంలా !

"ఆమె కనిపించలేదా ? నావెంట పడ్డారు ?"

రాంబాబు నవ్వాడు "ప్రేమంటే ఎవరో అమ్మాయనుకున్నారా ? ప్రేమంటే. ప్రేమే లవ్ అర్థమయిందా ?"

ఆమె కళ్లు పెద్దవి చేసి వింతగా చూసింది

"అలా చూస్తారేం ? నమ్మకం లేదా ? మాఅమ్మ ప్రతిక్షణం 'పెళ్ళి చేసుకోరా' అంటూ ప్రాణం తీస్తున్నాది ప్రేమించనిదే పెళ్లిచేసుకోనని తెగేసి చెప్పేశాను" అన్నాడు

"అందుకని, ప్రేమించటానికో అమ్మాయి అంటు బొంకుల దిబ్బమీద స్థిర నివాసం ఏర్పరచుకున్నా రన్నమాట ! బావుంది"

"ప్రేమించకుండా పెళ్లి చేసుకుంటే ఏం బావుంటుంది చెప్పండి."

"ఏం బాగోదు ప్రేమించాలి ముందు తర్వాతే పెళ్లి !"

"అరే మీరుకూడా నాలాగేఅన్నారే" సంబరంగా అన్నాడు, రాంబాబు

"ఎందుకనను ? నేనూ మీ పరిస్థితి లోనే ఉన్నాను మరి"

"మీరుకూడానా ?" ఆశ్చర్యపోయాడు.

"ఎందుకలా ఆశ్చర్యపోతారు ? ప్రేమించి పెళ్లి చేసుకునే హక్కు మీ మగాళ్లకేగాని మాకు లేదా ?"

"ఎందుకు లేదు ? దివ్యంగా ఉంది"

"ఈ ఊళ్లోనే ఎవరికో ఓ మీసాల అబ్బాయి ఉన్నాడట ఆ అబ్బాయికి మంచి ఉద్యోగంకూడా ఉందట ! కాబట్టి అతన్ని నేను పెళ్లి చేసుకోవాలిట ! ఇలాఅని మా నాన్నగారు రోజుకో సారైనా అంటూ ఉంటారు ఎటొచ్చీ నాకే యిష్టంలేదు"

"ఎందుకని ?"

"ప్రేమించకుండా పెళ్లేమిటండీ !"

"మంచిమాట ! మనసులో మాటమాట మీరెవర్నీ ప్రేమించలేదా, ఇంతవరకూ ?"

"ఏదీ తగిన అబ్బాయి కనిపించనిదే"

రాంబాబు మనసు కుదుటపడింది

"చూడండి ! మనిద్దరి పరిస్థితి ఒకటే ! ఎవరికో ఓ బంగళా, కారూ, పెళ్లికావలసిన ఆడకూతురు ఉంటే ఉండొచ్చుగాక అందుకని ఆవిడగార్ని నేను పెళ్లిచేసుకొని, ఆ ఆస్తికి అల్లుడ్ని కావాలని మా పెద్దవాళ్ల అభిప్రాయం ఇదేమన్నా బావుందా ?" అడిగాడు

"ఎంత దారుణం ? అందులోనూ మగ మహారాజులు ... మీకే యిన్ని కష్టాలా ?" సానుభూతి చూపించింది

"అందుకని నాకో ఐడియా వచ్చింది అన్నట్లు మీ పేరేమిటన్నారు ?"

"లక్ష్మి"

చక్కనిపేరు చూడండి, నాకీ కారు అమ్మాయి వెధవ, మీకా, మీసాల అబ్బాయి గొడవ తప్పాలంటే, మనిద్దరం జాయింటుగా ఓ ప్లాను వేయాలి"

"చెప్పండి"

"అదే" అని నసిగి ఆమె వైపోకసారి చూసి "మనం ప్రేమించుకుందాం. ఏమంటారు ?" అన్నాడు, ఆతృతగా

ఆమె క్షణం ఆలోచించి". ప్చ్ లాభం లేదండి ." అంటూ తేల్చేసింది !

రాంబాబు డీలా పడిపోయాడు "ఏం ? నాకు మీసాలున్నాయనా ? ఇవ్వాళే .. ఇప్పుడే గీయించేస్తాను" అన్నాడు, ఆవేశంగా !

ఆమె నవ్వింది, మృదువుగా "అబ్బే అదేంకాదు మీ మీసాలకేం ముద్దొస్తున్నాయి ఎటొచ్చీ చిక్కంతా మాబావతోనే !"

"బావా ? అతనొకడున్నాడా మధ్యన ?"

"నిక్షేపంలా కండలు పెంచుకొని మరీ కూర్చున్నాడు నన్ను ప్రేమించాలనుకునే వ్యక్తి ముందుగా అతనితో బాక్సింగ్ చేయాలట ! అతనితో బాక్సింగ్‌లో గెలిస్తేనే తరువాత సంగతి మీరు చూస్తే నాకంటే నాజూగ్గా ఉన్నారాయె" అంది, విచారంగా !

"తప్పదా ?" రాంబాబు నీరసంగా అన్నాడు.

"మనం ప్రేమగురించి ఆలోచించేముందు, మీరు మా బావ గురించి ఆలోచించడం మంచిది వస్తా గుడ్‌లక్" అంటూ, వెళ్లిపోయింది లక్ష్మి !

* * *

"హమ్మయ్య వచ్చారా ?" అన్నాడు రాంబాబు, తేలిగ్గా నిట్టూర్చి !

"మీరు రమ్మన్నారుగా ! అందుకే వచ్చాను" అంది లక్ష్మి, చిన్నగా నవ్వి !

రాంబాబు టిక్కెట్లు తెచ్చిన తరువాత ఇద్దరూ లోపలికి వెళ్లి కూర్చున్నారు.



ఖాళీ వచ్చినప్పుడు నాకు ఉద్యోగం తప్ప కుండా ఇస్తానన్నారు కదా — అప్పటికి నేను లేకపోతే మావాడికివ్వండి సార్ !

---

"ఏమిటి తేల్చారు?" కూర్చున్న తరువాత లడిగింది లక్ష్మి!

"దేనిగురించి మన ప్రేమ గురించేనా?"

"కాదు మా బావ గురించి"

"పెద్ద చెగోనికి తోసేస్తాను " రాంబాబు కోపంగా అన్నాడు "మీ బావనలా ఉంచండి మీరు నన్ను ప్రేమిస్తున్నట్లేగా?" అడిగాడు

"అదే ఇంకా ఏదీ నిర్ణయించుకోలేదు నేను మిమ్మల్ని ప్రేమించాలంటే ముందు మీరు నా షరతులకు అంగీకరించాలి "

"ఏమిటండోయ్ అవి!" రాంబాబు కుతూహలంగా అడిగాడు

"నెంబర్ వన్ పెళ్లయిన తరువాత మీరు భర్త, నేను భార్య అనే తేడా ఉండ కూడదు "

"ఉండకూడదు .సరే!"

"నెంబర్ టూ .. నేనూ ఉద్యోగం చేస్తాను మనిద్దరి జీతంనేనేస్పెండ్‌చేస్తాను "

"ఇదీ బాగానే వుంది. తర్వాత?"

"వంటా వార్పుల సంగతి నే నొకపూట వంటచేస్తే, మీరు రెండోపూట చేయాలి "

"నేనా ? నాకు వంటరాదుగ " రాంబాబు కంగారుగా అన్నాడు

"రాకపోతే నేర్చుకోండి -" నిర్లక్ష్యంగా అంది లక్ష్మి!

"ఇంకా ఉన్నాయా ?"

"జస్ట్ రెండేరెండు .! పెళ్లికాగానే మనం వేరు కాపరం పెట్టాలి !"

"వేరు కాపరమా ? మైగాడ్ ."

"ఇకపోతే " రాంబాబును గమనించ కుండా చెప్పుకుపోసాగింది లక్ష్మి "నాకు ఇష్టంలేనిపని మీరేంచేసినా ఆ క్షణంతో మీకూ నాకూ చెల్లు .."

రాంబాబుకు భూమి గిర్రున తిరుగు తున్నట్లనిపించింది



# ప్రేమించి చూడు

"అంతేకాదు వీటికిముందు మీరు మా బావతో మల్లయుద్ధంచేసి ఓడించాలి " అంది లక్ష్మి ఓరగాచూస్తూ !

* * *

"ఎక్కడికోయ్ అపరుగు ?" ఆఫీసు అయిపోగానే హడావుడిగా వెళ్లిపోతున్న రాంబాబును ఆపి అడిగాడు సత్యమూర్తి!

"జిమ్నాజియంకు వెళ్లాలి "

"జిమ్‌కా ? ఎందుకట ?"

"ఎందుకేమిటి ? కండలు పెంచొద్దూ, మరి ?

సత్యమూర్తి నవ్వాడు "ముచ్చటగా ముద్దొచ్చేలా ఉన్నావ్! కండలుపెంచి, దున్న పోతులా లావెక్కి ఎవరితో కుస్తీలు పడతావ్! హాయిగా పెళ్లికొడుకులా ఉండక ఇదేం ఖర్మ! అన్నట్లు మీ అమ్మగారు చెప్పారు ఈమధ్య వంటనేర్చుకుంటున్నావటగా ? ఎందుకొచ్చిన రొష్టుచెప్పు.. "

"అలా కొట్టిపారేయకోయ్ ! అన్ని విద్యల్లోనూ ఆరితేరిఉండాలి అవసరం అంతే " అన్నాడు, రాంబాబు

"సంతోషించాంగాని, నీతో కాస్త పనుంది. అలా మాయింటికి వెళ్దాం, రా !"

"సారీ గురూ నేను రాలేను " రాంబాబు వెళ్లబోయాడు

సత్యమూర్తి, రాంబాబు జబ్బ అంది పుచ్చుకొని ఆపాడు "వెళ్లచూద్దాం " అన్నాడు, నవ్వి !

రాంబాబు నిస్సహాయంగా చూశాడు

"ఇలా అయితే నువ్వు ఆ వస్తాదుగాడితో కుస్తీ పట్టినట్లే " అన్నాడు, సత్యమూర్తి నవ్వుతూ!

"అరే నీకెలా తెలుసు?" రాంబాబు ఆశ్చర్యంగా అడిగాడు

"నాకు అంతా తెలుసు సదు " అన్నాడు, సత్యమూర్తి!

సత్యమూర్తి ఇంటిలో కొత్త వ్యక్తిని చూసి .."ఎవర్రా ఆయన ?" అంటూ అడిగాడు రాంబాబు!

"నీక్కాబోయే మామ "

"వెధవ జోకులు వెయ్యకు."

"జోకులుకావు కావాలంటే రా ఆయ నకు పరిచయం చేస్తాను, నిన్ను" అంటూ రాంబాబును లాక్కెళ్లి ఆయనకు పరిచయం చేశాడు సత్యమూర్తి!

"అమ్మాయి మీ గురించి చెప్పింది" అన్నాడాయన నవ్వి!

"అమ్మాయా? హూ ఈజ్ షి?" రాంబాబు ఆశ్చర్యంగా అడిగాడు

"ఇంకెవరుసార్! నేనే!" అంటూ వచ్చింది లక్ష్మి!"

"అంటే" రాంబాబు తెల్లబోయాడు.

"సత్యమూర్తి మా బావ" అంది లక్ష్మి.

"డోంట్ వర్రీ నాతో బాక్సింగ్ చెయ్యొద్దులే" అంటూ అభయం పారేశాడు, సత్యమూర్తి!

ఇంతలో సస్పెన్స్‌ను మరింత క్లైమాక్సుకు తెస్తూ రాజారావుగారు, సుందరమ్మ లోనికి వచ్చారు

"ఇంకేం మా ప్రబుద్ధుడూ ఇక్కడే ఉన్నాడు శుభం" అన్నారు రాజారావుగారు

"నాన్నా" రాంబాబు కంగారుగా అన్నాడు

"ఇంకా ఏమిటోయ్ ప్రేమించాలన్నావ్! కాదన్నానా? నీ పని సరి మరి మాట్లాడకు" అన్నారు, రాజారావుగారు,

"మీరంతా కలిసి నన్ను ఫూల్‌ని చేశారు రాంబాబు కోపంగా అన్నాడు

"ఆగవోయ్ చవటాయ్! అసలు దీని కంతటికీ కారణం ఎవరు? నువ్వుకదూ?" అన్నాడు సత్యమూర్తి!

"నేనా?"

"లక్షరాలా నువ్వే ! పెళ్లి చేసుకోరా అం టే బలిమాలితే ప్రేమించాలని కూర్చున్నావ్ ! అసలే అర్భకం వెధవ్వి ! అందులోనూ ఆ మాణిక్యం భలే గడుసుది దొరికాడు లెమ్మని ఆవిడగారు నిన్నుకాస్త బుట్టలో వేసుకుంటే, నీ గతేం కావాలి ?"

"లక్ష్మి మామయ్య కూతురే అయినా, చిన్నప్పటినుండి కలిసి, మెలిసి పెరిగాం అందుకని వరసల్ని అవతలపెట్టి చూస్తే లక్ష్మి నాకు చెల్లెలు వంటిది లక్ష్మిని నీకివ్వాలనే ప్రపోజల్ నేనే చేశాను నువ్వేమో ప్రేమా గీమా అంటూ పోజులు వేశావ్. అందుకే ఈ నాటకం ఆడవలసి వచ్చింది అంతే మరేం కంగారుపడకు నీ వీసం గౌరిగించుకోనూ వద్దు నాతో బాక్సింగ్ చేయనూ వద్దు " అన్నాడు.

రాంబాబు తెల్లబోయి లక్ష్మి వైపు చూశాడు ,

లక్ష్మి సిగ్గుపడుతూ అందంగా నవ్వింది .

## ఆమె పెరిగి పెద్దదైన చాలా కాలం తర్వాత
## కూడ ఆ ఫోటో గుర్తుంటుంది.




ప్రతి 120 ఫిల్మ్‌రోల్ పైనా 12 పెద్ద (6×6 సెం.మి) ఫోటోలు వస్తాయి.
ప్రత్యేకమైన ఎవర్ రెడీ లెదర్ కేస్ పోర్ట్రెయిట్ లెన్స్ మరియు ఫ్లాష్‌గన్ అదనపు ధరలో లభిస్తాయి
సుస్పష్టమైన ప్రింట్లు మరియు ఎన్‌లార్జ్‌మెంట్ కోసం అగ్ఫా గెవార్ట్ ఫోటో పేపరు కావాలని అడగండి
అగ్ఫా గెవార్ట్ అధీకృత విక్రయదారులు అందరి వద్ద దొరకుతాయి

సోల్ డిస్ట్రిబ్యూటరు: అగ్ఫా గెవార్ట్ ఇండియా లిమిటెడ్
మర్కంటైల్ చాంబర్స్, 41, న్యూ మెరైన్ లైన్స్, బొంబాయి 400 020
శాఖలు: బొంబాయి న్యూ ఢిల్లీ కలకత్తా మద్రాసు
ఈ ఫోటోగ్రాఫిక్ వస్తువుల ఉత్పత్తిదారులైన అగ్ఫా గెవా
ఎంట్‌వెర్ప్ లివెర్కుసెన్ యొక్క రిజిస్టర్డు ట్రేడ్‌మార్కు.
ఇండియాలో తయారుచేయువారు: ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిం

లోకం పోకడ — ఓమెక















# వారఫలం

**16-5-1975 శుక్రవారం మొదలు**
**22-5-1975 గురువారం వరకు**

**మేషం :—** స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి సాటివారిలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి రాజకీయవ్యవహారాల్లో శ్రమకలుగుతుంది ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృషభం —** వ్యాపారంలో సాటివారి పోటీ తగ్గుతుంది ప్రయాణాలు ఫలిస్తాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది మిత్రుల సహాయం లభిస్తుంది స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు పుణ్యకార్యాలు చేస్తారు

**మిథునం .—** మీ ఆలోచనలు ఫలిస్తాయి నూతన వ్యవహారాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది అధికారులవలనజరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కర్కాటకం —** మీ కార్యక్రమాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందుతుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు నూతన విషయాలను తెల్సుకొంటారు సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు

**సింహం .—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వృత్తిలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనకరంగల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది

**కన్య :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**తుల '—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో

# వారఫలం

నూతనావకాశాలు లభిస్తాయి సాహసిక వ్యవహారాలు బాగుంటాయి వారం అఖరులో మీతాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది వ్యతిరేకమైన వార్తలను వింటారు

**వృశ్చికం :—** వృత్తిలో ఆదాయం పెరుగుతుంది మిత్రులకు సహాయం చేస్తారు స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు మీ ప్రయత్నాలు ఫలిస్తాయి నూతన వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు బంధుమిత్రులను కల్సుకొంటారు

**ధనుస్సు —** లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును వ్యాపారంలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో నూతనావకాశాలులభిస్తాయి ప్రయాణాలు ఫలించగలవు స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి

**మకరం —** రావలసిన డబ్బు అందుతుంది మీ ఆలోచనలు ఫలిస్తాయి వారం మధ్యం ఆందోళన కలుగుతుంది మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు వారం అఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి స్త్రీలకు—కుటుంబసంతోషం లభించగలదు బంధువులకు చికాకులు ఏర్పడతాయి



నువ్వు ముద్దు గురించి ఆలోచించటం మానెయ్యాలోయ్ —

**కుంభం —** మీ కార్యక్రమాలకు మార్పులవస్తాయి పోటీవారితో మాట పట్టింపులుతగవు వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వారం అఖరులో చేజిక్కిన అవకాశాలు జారిపోవచ్చును స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి

**మీనం —** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు అనవసరమైన సందేహాలు కలుగుతాయి వారం అఖరులో భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలులాభిస్తాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

— మహేష్







U-BDM-25 TEL

రాజేష్ ఖన్నాకు నచ్చే బట్టలను బొంబే డయింగ్ వారు సమకూరుస్తున్నారు—ప్రతి రోజూ ఒక కొత్తదీ తాజాదీ అయిన డిజైనుతో—సింథటిక్ షర్టింగు యొక్క సమ్మోహాతులను చేసే శ్రేణిలో—50/50 67/33 80/20 అదిగాక 100% పోలియస్టర్ ప్రింట్లు పోలియస్టర్ డెనిమ్స్ యింకా టెక్స్చరైజ్డ్ సూటింగులతో

**బట్టల్లో లెక్కకు మిక్కిలి అందాలు—**
**ప్రతి రోజూ సరికొత్త డిజైన్లకు రూపాలు**

**కాపితాన్** పోలియస్టర్ షర్టింగు
వాడ్రిన్ పోలియస్టర్ సూటింగు

# బొంబే డయింగ్



తల్లి దగ్గర్నుంచి మళ్లీ ఉత్తరం వచ్చింది ఆదిత్యకు ఉత్తరం రావటంకాదుగానీ, దాంట్లో తన పెళ్లి గురించి మరీ, మరీ వొత్తిడి చేస్తూ వ్రాయటమే ఆదిత్యకు విసుగు కలిగింది

'ఏవేవో సంబంధాలు — తమ ఫాయిదాకు సరిగ్గా సరితూగగలవిట !

అటువంటి వివాహాలు తనకి సుతరామూ యిష్టంలేదనీ, ఆ పిల్లలెవరూ తనకి అక్కర్లేదనీ, తల్లికి చెప్పాలంటే — ఎటువంటి వివాహం తనకి యిష్టమో, ఏ పిల్ల తనకి కావాలోగూడా చెప్పగలిగి వుండాలి తను !

తను మరి ఆ స్థితికి యింకా చేరుకోలేదో, ఎటువంటి వివాహం తనకి యిష్టమో చెప్పగలడు కానీ,

ఏ పిల్ల తనకి యిష్టమో —

ఆ పిల్లతో మాట్లాడకుండానే, ఆమె అభిప్రాయం లేకుండానే, అనుమతి తీసుకోకుండానే, ఎలా చెప్పగలడు తల్లికి ?''

అందుకే ఆ విషయాన్ని దాటవేస్తూ జవాబు రాసి పడేశాడు

ఉత్తరంలో దాటవేయగలిగాడు గానీ, మనసుని దాటటం తరం కాలేదు

'అవును తను శమంతని ప్రేమిస్తున్నాడు ఆమెలో తన ఆశయాల్నీ, ఆకాంక్షల్నీ నింపుకున్న పరిపూర్ణమూర్తిని చూడగల్గుతున్నాడు

ఆ విషయం ఆమెకు చెప్పాలి

తనతో బ్రతుకు పంచుకోవటం ఆమె కిష్టమో, కాదో అడిగెయ్యాలి !' అనుకున్నాడు

## 11

బలరామయ్యగారి ఆరోగ్యం కుదుటపడ్డట్టే, పడుతూ, మళ్లీ ఒక్కసారిగా తిరగబెట్టింది

ఆరోజు సాయంత్రం షికారుగా బజార్లోకి వెళ్లిన బలరామయ్యగారు రోడ్డు దాటుతూ, హఠాత్తుగా వచ్చిన లారీని తప్పుకునే ప్రయత్నంలో గబగబ అడుగులు వేయాల్సివచ్చి, బొక్కబోర్లా పడిపోవటంతో బ్లడ్‌ప్రెషర్ హెచ్చి గుండె దడ పెరిగింది ఎవరో ఎరిగున్న పెద్దమనుషులు సమయానికి అక్కడుండటంతో రిక్షాలో ఇంటికి చేరవేసి నాలుగు చివాట్లుపెట్టి వెళ్లారు -అటువంటి జబ్బు మనిషిని వంటరిగా బయటకు పంపినందుకు !

''కొంపలో రోజల్లా పడుండాలంటే చచ్చే చికాకుగా వుంటోందమ్మా ! అందుకే సాయంత్రం అక్కడికీ, శంకరాన్ని సాయం రమ్మన్నాను వాడు నామాట వినిపించుకుంటాడా? దబాయించి పారిపోయాడు ! అందుకే ఒక్కణ్ణీ వెళ్లాను ''

ఆయాసపడుతూనే అన్నారాయన

శమంత కళ్లలో నీళ్లు తిరిగాయి

'ఛ ఛ రోగిష్టి మనిషి, ఒక్క గంటసేపు బయట తిరగటానిక్కూడా నోచుకోలేదా ?

పదహారేళ్ల వెధవ వాడికి ఆపాటి బాధ్యత తెలీదూ ? తండ్రి ఘాటల్నికూడా లెక్కపెట్టకుండా పోతాడా !'

అమ్మడిమీద అంతులేని కోపం ముంచుకు

# శమంత హేమంత

సీరియల్

పి.వి.ఆర్.శివకుమార్

***(గత సంచిక తరువాయి)***

వచ్చింది కానీ, ఏమీ అనటానికి అధికారం లేదు తన నిస్సహాయతమీద తనకే కోపం వచ్చింది కన్నీటిరూపంలో ఆ కోపం చల్లార్చుకుంది

పక్క సరిజేసి, తండ్రి పక్కనే కూర్చుంది

ఏడున్నరగంటల వేళకు ఆదిత్య వచ్చాడు అప్పటికీ ఆయన పరిస్థితి అలాగే వుంది

ఆదిత్యకు ఆయన్ని చూసేసరికి భయమేసింది హాస్పిటల్‌లో చేర్పించటం మంచిదనిపించింది నచ్చచెప్పి, అప్పటికప్పుడు తీసుకువెళ్లి హాస్పిటల్లో చేర్పించేశాడు

* * *

బలరామయ్యగారు హాస్పిటల్లో చేరి దాదాపు వారంరోజులు కావస్తోంది ఆయన ఆరోగ్యం మాత్రం యింకా ఒక దరికి చేరుకోలేదు ఒకరోజు నార్మల్‌గా వుంటే, మరొకరోజు తిరగబెట్టేస్తోంది మామూలుగా వాడే మందులూ, ఇంజక్షన్లూ ఏమాత్రం పనిచెయ్యకుండా పోతున్నాయి

''గుండె బలహీనత ఎక్కువగావుంది మనిషికి ముందు అది కంట్రోల్ చెయ్యకపోతే ప్రమాదం తర్వాతకూడా ఉద్రేకం తెప్పించకుండా గాజుబొమ్మలా కాపాడుకోవాలి మనిషిని'' అన్నారు డాక్టర్లు

ఆదిత్య ద్వారా వచ్చిన కేసు కావటాన అందరూ తగిన శ్రద్ధ చూపుతున్నారు ఆయన విషయంలో

ఆదిత్యకు డాక్టర్‌గానే కాక, మనిషిగా కూడా శ్రమ అధికమైపోయింది

హాస్పిటల్‌కు తిరగటానికీ, మందులవీ తేవటానికీ శమంతకు మరో తోడు ఎవ్వరూ లేరు తమ్ముడు ఆమెకి వీసమెత్తు సాయం కూడా చెయ్యటంలేదు అత్తణ్ణే సావిత్రి ఏమీ అనదు ఆవిడ యిల్లు కదిలితే, యింట్లో పని చేసేటందు

> ***జరిగిన కథ 4 .*** ధనలక్ష్మి కొడుకు ఆదిత్య డాక్టరు శమంత తండ్రి బలరామయ్యగారికి గుండె జబ్బు ఆదిత్య వైద్యం ప్రారంభిస్తాడు శమంత సంపాదనపై ఆధారపడాల్సి వచ్చినందుకు బాధపడుతూంటారు బలరామయ్యగారు మేనకోడలు శమంతను వివాహం చేసుకోవాలనుకుంటాడు ఆనంద్ స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించని ఆనంద్ శమంతకు నచ్చడు

కెవ్వరూ వుండరు అందుకే ఆమె కూడా యిల్లు కదలదు ! సాయంత్రాలు మాత్రం వెళ్లి చూసివస్తూ వుంటుంది

ఇక శమంతతోపాటూ 'షిఫ్టు' డ్యూటీల్లో పాల్గొనే భారం ఆదిత్యే, తనంత తానుగా, స్వీకరించాడు అవసరమైతే, శలవుకూడా పెడుతున్నాడు ఇరవై నాలుగు గంటలూ ఆయన దగ్గర ఎవరో ఒకరుండేలా శ్రద్ధ తీసుకొంటున్నాడు

ఆ సాయంత్రం డ్యూటీవించి వచ్చి, స్నానం చేసి హాస్పిటల్‌కి బయల్దేరుతుండగా, తనూ వస్తానని కబురు చేసింది సావిత్రి ఆమెనుకూడా తీసుకు బయల్దేరాడు

బలరామయ్యగారి దగ్గర ఓ గంటసేపు కూర్చుని, 'మరి వెళ్తా' నంటూ లేచాడు

''నువ్వుకూడా వెళ్లి, స్నానం, భోజనం చేసిరా ! నేను యిక్కడే వుంటాను అందాకా'' అంటూ శమంతను కూడా లేవదీసింది సావిత్రి

ఇద్దరూ కలిసి బయటకు వచ్చారు ఆటో స్టాండ్‌కి నడవసాగారు

శమంతను చూస్తే ఆదిత్యకు జాలి వేసింది ! గత వారం రోజులుగా సరైన తిండీ, నిద్రా లేక కళ్లు పీక్కుపోయి, ముఖం పీరసించి వుంది !

''ఇప్పుడిక యింటికి వెళ్లి వంట చెయ్యాలి గాబోలు !'' సానుభూతిగా అన్నాడు

''అవసరం లేదు పిన్ని చేసే వుంచిందిట !'' అందామె

''అయితే, వెళ్లీ, వెళ్లగానే భోంచెయ్యటం — వెంటనే పరుగుల మీద తిరిగిరావటం అన్నమాట ! అబ్బ, బోరుకొట్టటంలేదూ మీకు ?''

తలెత్తి ఒక్కసారి అతడివైపు చూసి, తల దించుకుంది శమంత ఆ లిప్తపాటులోనూ ఆ కళ్లలోని ఆర్తిని గుర్తించాడు ఆదిత్య అతని హృదయం సానుభూతితో ద్రవించింది

''అలా ఆ పార్కులోకి వెళ్లి కూర్చుందాం, పదండి ఓ అరగంట సేపయినా విశ్రాంతి దొరుకుతుంది '' అన్నాడు

అభ్యంతర పెట్టలేదు శమంత

ఇద్దరూ మౌనంగా నడిచి, ఒకచోట కూర్చున్నారు

''మరీ ఓవర్ బర్డెన్డ్ అయిపోయారు మీరు'' జాలిగా అన్నాడు ఆదిత్య

''మా నాన్నగారికి, నేను సేవ చేయటంలో బర్డెనేముందండీ !''

''మీ నాన్నకి మీరు చేయటం బర్డెన్‌కాదు మీరొక్కరే చేయాల్సిరావటమే బర్డెన్

కనీసం మీ కష్టసుఖాల్లో పాలుపంచుకుందుకు మరొక్క అన్నయ్యో వున్నా బాగుండిపోయేది !''

''ఆ మాట నేనెప్పుడూ అనుకుంటూ వుంటాను కానీ, ఆ అదృష్టమూ అందరికీ వుండదు '' నిస్పృహగా అంది శమంత

''ఒక్క మాటంటాను కోపం తెచ్చుకోరుగా !'' — కొద్దిసేపాగి, నెమ్మదిగా అన్నాడు ఆదిత్య — ''మీరు పెళ్లెందుకు చేసుకోకూడదు? అదే, మీ నాన్నగారికి అదే పెద్ద మనోవ్యాధి అయిపోయిందికదా ! మీకు వివాహం జరిగితే ఆయనకు సగం రిలీఫ్ దొరుకుతుంది !''

"పెళ్లి" పేలవంగా నవ్వింది శమంత, "చూశారుగా మా మామయ్య విషయం! అతణ్ని చేసుకుని నేన్ను వెళ్లిపోతే, యిప్పుడు మా నాన్నగారికి మందులు కాదుగదా, తిండిక్కూడా పైసా వుండేది కాదు! కనీసం, యీమాత్రపు సాయం చెయ్యటానికి నేనూ వుండేదాన్నికాదు!

మామయ్యేకాదు, ఎవరైనా అంతేకదా! ఏ యువకుడు మాత్రం అంతకన్న భిన్నంగా ఎలా ప్రవర్తించగలడు? కట్నాలు వదులుకోగలరా — సుఖాలు వదులుకోగలరా? మరి, వాళ్లకోసం నేను మా నాన్నని వదులుకోగలనా?

అందుకే పెళ్లినే వదులుకోవటం తేలిగ్గా అనిపిస్తోంది!"

"పర్మనెంటుగా వదిలేసుకోగలరా?" వ్యంగ్యంగా అడిగాడు

"ఏమో అది యిప్పుడే చెప్పలేను"

"మీరేదో మీ నాన్నగారికి మేలు చేస్తున్నా ననుకొంటున్నారు గానీ, చేజేతులా ఆయనకి కీడే చేస్తున్నారన్న విషయం గుర్తించటంలేదు శమంతా!" తీవ్రంగా అన్నాడు ఆదిత్య — "ఏ కన్న తండ్రీ తన కూతురు పెళ్లి మానుకుని, తనని పోషిస్తూ వుండిపోవాలనుకోడు అలా చేస్తుంటే హర్షించడు!

ఎవరేనా అలా కోరుకున్న పక్షంలో అతడు నిజమైన తండ్రికాదు!

అయినా, ఆ విధంగా చేయటం మీ సమస్యకు పరిష్కారమూ కాదు సమస్య లెదురైనప్పుడు పరిష్కారమార్గం అన్వేషించటం వివేకంగానీ, సమస్య నుండి దూరంగా పారిపోవటంకాదు మనం పరుగెత్తినకొద్దీ సమస్యలు మనల్ని నీడల్లా వెంటాడతాయి తప్ప, దూరంగా తొలగిపోవు"

"కొన్ని కొన్ని సమస్యలకి పరిష్కారాల వెదుకులాట అనవసరం ఆదిత్యగారూ! ఇలాటి సమస్యల్ని కాలమే పరిష్కరిస్తుంది! అలాటి సమస్యే నాదీనూ!

మా కుటుంబానికి మరో ఆలంబన దొరికే రోజంటూ ఎప్పటికైనా రాకపోదుగా! అప్పటి వరకూ నేనిలాగే వుండిపోతాను

అనాటికి జీవన సమరంలో నేనింకా అలిసిపోక, ఆదర్శాలంటూ మిగుల్చుకోగలిగితే, వాటికి తగిన వ్యక్తి దొరికితే వివాహం చేసుకోవచ్చు

లేదా, అప్పటికే అలిసిపోయి, ఆదర్శాలన్నీ ఆవిరిగా మారి గాలిలో కలిసిపోయి, వివాహంతోనూ, జీవితంతోనూ రాజీ పడిపోవలిసి వస్తే, అందుకు తగ్గ వరులు వందల సంఖ్యలో లభిస్తారు — కనీసం రెండో పెళ్లివాళ్లయినా —"

మరి మాట్లాడలేక ఆపేసింది శమంత




ఆమె మనసులో మరుగుతున్న లావాని ఆదిత తన మాటలతో కదిపి, వెలికి తీయటం ఆమెలో విపరీత సంచలనాన్ని కలగజేసింది

కింకర్తవ్య విమూఢత, అసహాయత, మాట సహాయమైనా చేయని 'తనవాళ్లు', కృంగదీసి పరీక్షిస్తున్న పరిస్థితులు వీటన్నిటి మధ్య ఆదిత మాటలు చల్లగాలిలా తగిలి, ఆమెలో కరడుగట్టి మేఘాల్ని కరిగించాయి!

ఆ పరిస్థితిలో ఆమెను చూస్తున్న ఆదిత్యకు తనని తాను నిగ్రహించుకోవటం కూడా సాధ్యం కాలేదు

'బాధపడకు శమూ, నే నున్నాను నీ' కని ధైర్యం చెప్పి, దగ్గరకు తీసుకోవాలనిపించింది కానీ సమయం కాదు తొందర పడకూడదు నెమ్మదిగా గొంతు విప్పి, సానుభూతిగా అన్నాడు —

"మీరు అనవసరంగా అల్పమైన సమస్యల్ని భూతద్దంలోంచి చూసి, కంగారు పడి, మనసు చెడగొట్టుకుంటున్నారు! వయసుకు మించిన బాధ్యతలు నెత్తిన పడ్డ క్షణాన ఏ మనిషైనా అంతే! కానీ, అంతమాత్రానే మీ రింతగా అధైర్యపడిపోయి, ఆదర్శాలను కూడా వదులుకోవలసి వస్తుందేమో ననటం విచారకరం! ఆదర్శాల్ని వదులుకోవటం ఆత్మహత్యా సదృశం శమంతా!"

"అంతకన్న దిక్కులేని నేను మరేం చేయగలనో చెప్పండి" రోషంగా అంది శమంత

"లోకం గొడ్డుపోలేదు శమంతా! ఇంకా మానవత్వమున్న మనుషులు మన చుట్టూ వున్నారు

మీరు ముందుగానే అపోహపడి వూహాగానాలు చేసి, మీతో ఏకీభవించగల ఆదర్శాలున్న యువకులు ప్రపంచంలో లేరేమోనని భావించి, వివాహమే చేసుకోకూడదని నిర్ణయాలు తీసుకుని, అదే మీ నాన్నగారికి మీరు చేయగల సహాయమనుకుంటూ మరింత ద్రోహం చేస్తున్నారు

స్థిమితంగా యోచించండి మీ సమస్యకు పరిష్కారం లభ్యమౌతుంది

ఇప్పుడు మీ నాన్నగారికి మందులకన్న ముఖ్యం మనశ్శాంతి ప్రస్తుత పరిస్థితుల్లో అది మీ వివాహం వల్లనే లభ్యమౌతుంది

మీకున్న పరిధిలోనే మీ ఆదర్శాలతో ఏకీభవించగల వ్యక్తికోసం వెతకండి

అందరిలా స్వార్థం మూర్తీభవించనివాడూ ఆత్మగౌరవం కలిగి, కట్నం పేరిట మిమ్మల్ని దోచుకొనే ఉద్దేశ్యం లేనివాడూ, సగటు యువకులలా వివాహం కాగానే నా భార్య నాది, ఆమె నా యింటికి వచ్చి, నా కుటుంబంలోని వాళ్లందరి సేవలు చేయాలని భావించటమే కాక, ఆమె నా భార్య కావటంతో రెండు కుటుంబాలూ ఒక్కటయ్యాయి కనుక, ఆమె కుటుంబ సుఖ సౌఖ్యాలూ, కష్టనష్టాలూ కూడా నావే ఒకరి కొకరు మంచి చెడ్డలు చూసుకుంటూ, సహజీవనం సాగించవల్సి వుంటుందన్న సత్యాన్ని గుర్తించినవాడూ,

వీటన్నిటితోపాటూ మీ అభిప్రాయాలకూ వ్యక్తిత్వానికీ విలువనిచ్చి గౌరవించేవాడూ—

ఇలాంటి యువకునికోసం వెదకండి

## శశివంత — హేమంత

అటువంటి అల్లుడు దొరికిననాడు మీ నాన్న గారికి కడిగిన కొడుకు లేని కొరతా తీరుతుంది కొండంత మనశ్శాంతి లభిస్తుంది

మీరూ ఒక్కరుగా భరిస్తున్న వయసుకు మించిన బాధ్యతల్ని కష్టసుఖాల్ని జీవిత భాగస్వామితో పంచుకు బరువు దించుకోగలుగుతారు !

ఆశ మనల్ని నడిపే దీపిక శమంతా ! అదే మరూ ఆలంబనగా చేసుకోండి దాన్ని ఆర్పుకున్నాడు అంతటా అంధకారమే ! దయచేసి ఆ పని మాత్రం చేయకండి

ఆదిత్య మాటలు వింటూనే శమంతకు ప్రోత్సాహం కలిగింది ఆ మాటల్లో ఆమెకు కనబడిన కొత్త అర్థాలు నూతనోత్సాహాన్ని కలగజేశాయి

చాలా చాలా థేంక్స్ ఆదిత్యబాబూ ! మీ మూల్యమైన సలహాకు మన పూర్వక కృతజ్ఞతలు

మీరన్న విషయాన్నే ఆలోచిస్తూ ఆశాదీపం తోనే నా దారి వెదుకుతాను ఉత్సాహంగా అంది

దట్స్ గుడ్ శమంతా ! నేను చేసిందేమీ లేదు పరిస్థితుల్ని మీ ముందు పరిశీలనగా విప్పి వుంచాను అంతే ! అన్నాడు ఆదిత్య

ఇంక పోదాం మళ్లీ ఎన్ని ఎదురుచూస్తూ వుంటుంది అంది టైమ్ చూసిన శమంత

ఇద్దరూ లేచి బయటికి నడిచారు

### *12*

నెల రోజులు పట్టింది బలరామయ్యగారు కోలుకుని ఫర్వాలేదు డిస్చార్జ్ కావచ్చు నని ఎంచేసరికి ఏరో రెండు రోజుల్లో యింటికి తీసుకువెళ్లవచ్చు ననుకుంటున్నారు

ఆ రోజు సాయంత్రం ఆయన దగ్గర కూర్చుని బుర్ర చెపోతోంది శమంత అప్పుడే డ్యూటీ ముగించుకు వచ్చాడు ఆదిత్య

ఇక పోదామా ? అన్నాడు ఆమెను చూసి

అలాగే ! ముందిది తీసుకోండి అంటూ మంచానికి వారగా వున్న ఫ్లాస్కు తీసి రెండు కప్పుల్లోకి పొగలు కక్కుతున్న కాఫీ పర్చింది — ఆదిత్యకొకటి అందించి తనూ వొకటి తీసుకుంది శమంత

మౌనంగా సిప్ చేస్తున్న శమంతను చూస్తూ కళ్లనీళ్లు నింపుకు అన్నాడు బలరామయ్యగారు

ఎంత చిక్కిపోయావు తల్లీ యీ నెల రోజుల్లోనూ ! బొమికలు బయటపడ్డాయి !

ఏం లేదు నాన్నా నీకు ప్రేమకొద్దీ అలాగనిపిస్తోందంతే ! అనాలనుకుంది శమంత కానీ అనలేకపోయింది వేడి వేడి కాఫీ నాలుగు గుక్కలు తాగంగానే కడుపులో భగ్గునమండినట్లైందిఆమెకి !

అబ్బా ! అంటూ కాఫీ కప్పు పక్కన పెట్టేసి కడుపుమీద చెయ్యివేసి రాచుకుంటూ గోడకి చేరగిలబడిపోయింది

ఏమయిందమ్మా ! అమ్మాయ్ అంటూ మంచమ్మీదినుంచి లేవబోయాడు బలరామయ్యగారు

మీరుండండి నేను చూస్తాను — అంటూ గభాల్న ఉదుటున లేచి ఆమెను పట్టుకు నర్సుని కేకేశాడు ఆదిత్య ఇద్దరూ కలిసి ఆమెను డిస్పెన్సరీకి నడిపించుకు వెళ్లారు

పరీక్ష చేశాక ఆమెను ప్రశ్నించి వివరాలు తెలుసుకున్నాడు ఆదిత్య ఈమధ్య ఇరవైరోజులుగా ఆమెకు యిలాగే వుంటోంది తరుచుగా వేడి వేడి — పదార్థాలు తిన్నా, కారం అతిగా పడినా కడుపులో మంట వస్తోంది వేడి చేయటంవల్ల అలాగవుతోంది లెమ్మని సర్దు కుంటోంది శమంత

నెల రోజులుగా వేళకు తిండి లేక ఉన్న పూటయినా సరైన కూరలు లేక ఏ ఎప్పుడో వేసుకు తినటానా ఆమెకుకడుపులో రోజురోజూ మంటగానే వుంటోంది అయినా మొండిగా వూరుకుంటోంది

రేపుదయం ఎక్స్‌రే తీద్దాం ప్రొద్దున ఏనిమిదింటికల్లా ఆహారం ఏమీ పుచ్చుకోకుండా రండి అన్నాడు ఆదిత్య

ఎక్స్‌రేనా ? ఎందుకు ? కంగారుగాఅడిగిందామె

ఏం భయంలేదు కేవలం ఏం భయంలేదని తేల్చుకునేందుకే ! అన్నాడు ఆదిత్య పదండి మీ నాన్నగారితో చెప్పి వెళ్దాం

ఒక్కమాట ! యీ విషయం నాన్నగారితో చెప్పకండి కంగారుపడతారు ఏదో కళ్లుతిరిగి పడిపోయిందని చెప్పండి అలాగే !

మర్నాడుదయం తండ్రిని చూడటానికి వచ్చినట్లే వచ్చి ఎక్స్‌రే తీయించుకుంది శమంత

మూడోనాటి సాయంత్రం బలరామయ్య యింటికి తిరిగివచ్చేశాడు హృదయంమీంచి పెద్ద బరువేదో దిగిపోయినట్లుగాఊపిరి పీల్చుకుందిశమంత

కానీ ఆ సంతోషం మర్నాడే ఆవిరైపోయింది ఆదిత్య చెప్పిన మాట వినటంతో !

ఎక్స్‌రేలో చూసిన విషయంతో ఆదిత్యకు కూడా గుండె నీరయింది ఒకదాని తర్వాత ఒకటిగా కష్టాలు భరిస్తూ వుండటమే తప్ప నాల్రోజుల పాటైనా సుఖపడే యోగం లేదా యీమెకి ? అనుకున్నాడు బాధగా అసలామెకు చెప్పవద్దనీ అనుకున్నాడు కానీ ఆమెకు చెప్పకుండా ట్రీట్‌మెంట్ జరిగేదెలా ? కనుక చెప్పక తప్పలేదు అయితే ట్యూమర్ అని స్పష్టంగా చెప్పకుండా డొంకతిరుగుడుగా వివరించాడు

మీకు కడుపులో చిన్న కురుపులాగా అయింది శమంతా ! అయినా భయపడవల్సిందేమీలేదు చాలా ప్రారంభ దశలోనే వుంది కనుక ఆహార నియమాల్ని కాస్త జాగ్రత్తగా పాటిస్తూ మందులు శ్రద్ధగా తీసుకుంటుంటే అతి తేలిగ్గా తగ్గిపోతుంది నేనున్నాను — రోజూ పరీక్షిస్తూ మీకు తిరిగి మామూలు ఆరోగ్యం వచ్చేసేలా చూసేందుకు ఏమాత్రం భయపడకండి

అయితే ఈ విషయం మీ నాన్నగారికి ఎన్నికీ తెలియనివ్వకండి ఇంకెవ్వరికీ చెప్పద్దు మీ పిన్నికి తెలిస్తే అనవసరంగా గొడవ చేస్తుందేమో !

మౌనంగా తలూపింది శమంత కానీ ఆమెకు బాగా తెలుసు అతడంత తేలిగ్గా చెప్పిన ఆ మాటల్ని ఆచరించటం ఎంత కష్టమో !

మందులకీ మాకులకీ తండ్రితోపాటూ తనకూ డబ్బు కావాలంటే అతి కష్టం ! ఎన్నికీ తెలియకుండా ఆహార విషయంలో నియమాలు పాటించగల్గటం దాదాపు అసాధ్యం ! కానీ ఏం చెయ్యాలి ? నిస్సహాయంగా కన్నీళ్లు కార్చటంతప్ప మరేం చేయలేకపోయింది (ఇంకా ఉంది)



సంసారం లో

## ★ సినిమా విశేషాలు ★

### "పెద్దమనిషి"

చిత్రకళా మందిర్ నిర్మించిన పెద్దమనిషి చిత్రం తమిళభాషలో జ్ఞానవొలి పేరిట అఖండ విజయాన్ని అవార్డుల సత్కారాన్ని అందుకొని యున్నది

తమిళ నటసామ్రాట్ శివాజీ అద్వితీయంగా నటించిన పెద్దమనిషి చిత్రానికి కంచుకంఠం గొన్న కళావాచస్పతి జగ్గయ్య వచనాలను పల్కడం పెద్ద యస్సెట్ అవుతుంది

ఈ చిత్రంలో ఊర్వశి శివాజీతో పోటీపడి నటించింది రచనకు రాజశ్రీ సంగీతానికి సత్యం కూర్పుకు నరసింహారావు అధిపతులు పెద్దమనిషి చిత్రానికి ఎస్ ఎ రెడ్డి నిర్మాత

### ప్రసాద్ ఆర్ట్ ఎక్చర్స్ !

ప్రజల హృదయకు దగ్గరగా వున్న కొద్ది చిత్ర నిర్మాణ సంస్థలలో ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ ఒకటి ఇప్పటివరకు యీ సంస్థ అందించిన చిత్రాలన్నీ ఆంధ్ర ప్రజలచేత ఆదరింపబడడానికి కారణం కథల వైశిష్ట్యమేనని చెప్పొచ్చు

ప్రసాద్ ఆర్ట్ ఎక్చర్స్ నిర్మించనున్న కొత్త చిత్రంలో లక్ష్మి రామకృష్ణ ప్రధాన జంటగా నటిస్తున్నారు సహాయ పాత్రలను గుమ్మడి సత్యనారాయణ రాజబాబు పోషిస్తున్నారు ఈ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు

ఈ చిత్రానికి భమిడిపాటి రచనకు చలపతిరావు సంగీతానికి సెల్వరాజ్ ఛాయాగ్రహణానికి జి వి సుబ్బారావు కళకు అధిపతులు

జూన్ జులై ఆగస్టు మాసాలలో యీ చిత్రం షూటింగు పూర్తవుతుంది హైదరాబాద్ సారథిలోషూటింగు జరుగుతుంది నవయుగవిడుదల

## దాసరి మరో సృష్టి !

యుక్తవయసుకొచ్చిన పిల్లలు, పెళ్ళి చేసుకోకుండా, వాయిదాలు వేస్తూవుంటే ఏ తలిదండ్రుల మనస్సు వూరుకుంటుంది ? అందులోనూ మాతృహృదయం మరీ తల్లడిల్లిపోతుంది

సావిత్రి తనయుడు మురళీమోహన్ తనయుడి పెళ్ళి త్వరలో చేయాలని సావిత్రికి ఆసక్తి కానీ ఎప్పుడడిగినా, వద్దు, వద్దు అంటూ వారిస్తుంటాడు మురళీమోహన్ ఎన్నోసార్లు ఏమిటోలే అని వూరకుంది సావిత్రి కానీ ఒకసారి అసలు విషయం తెల్సుకోవాలని ఎవరినైనా ప్రేమించావా ? అనడుగుతుంది పుత్రుడ్ని ప్రేమించీ ప్రయోజనంలేదమ్మా అంటాడు ఆంధ్రోద్యమంలో ఆ అమ్మాయి అసువులు బాసిందని, ఆవిడ చావుతోనే తనలో ప్రేమ నశించిపోయిందని, మనసు చచ్చిపోయిందని అంటాడు

సుధను చవిచూడాల్సిన సుకుమార వయస్సులో మురళికి ఎంత అవాంతరం కలిగింది ? ప్రేమ సామ్రాజ్యంలో మురిసిపోవాల్సిన తరుణంలో ప్రేయసి ఎడబాటు ?

ఈ ఘోరం ఎలా జరిగింది ? ఆ వనిత నిజంగానే చనిపోయిందా ! లేదా ! అనే నిజాలు తెల్సుకోవాలంటే దర్శకుడు దాసరి నారాయణరావు నిర్దేశకత్వంలో రసమయంగా తయారైన "భారతంలో ఒక అమ్మాయి" చిత్రం చూడాల్సిందే విజయ వేలాంగణీ పిక్చర్స్ పతాకంక్రింద తుమ్మ మర్రిరెడ్డి, ముత్యాల నాగేశ్వరరావు నిర్మించిన ఈ చిత్రం పూర్ణా ద్వారా త్వరలో విడుదలౌతుంది

(28 వ పేజీ చూడండి)

బేబీ శ్రీదేవి యిప్పుడు కుమారి శ్రీదేవి అయింది
"అనురాగాలు"లో శుభతో శ్రీదేవి






*ఆవేళ సాయంత్రం ఆఫీసు వదలగానే సరాసరి యింటికే వచ్చాడు గోపాలరావు అదీ ఎంతో హడావిడిగా రోజూ అయితే అతడు ఆఫీసు అయిపోగానే అట్నుంచి అటే వెళ్లి ఎక్కడెక్కడో కాలంగడిపి రాత్రి ప్రొద్దుబోయాక గూటికి చేరుకొనేవాడు*

"మీరేం బ్రహ్మచారులుకారు ఇల్లు, పెళ్ళాం, పిల్లలు ఉన్నారన్న సంగతి యింత మరిచిపోతే ఎలా ?" అని గడపలో అడుగు పెట్టీ పెట్టకముందే దీర్ఘాలు తీసేది గోపాలరావు భార్య కామేశ్వరమ్మ అయినా మూర్ఖుడిలా బదులు పలుకకుండా ఆమె పెట్టిన నాలుగు మెతుకులూ తిని గప్‌చిప్‌గా పక్కమీదకు చేరి నిశ్చింతగా నిద్రపోయేవాడు అతడు

అది నిత్య కార్యక్రమం ఈరోజు అంత తొందరగా ఇంటిముఖంపట్టి వచ్చిన గోపాలరావును చూసి తన ముఖాన్ని చేటంత చేసుకొంది కామేశ్వరి 'అటు సూర్యుడు ఇటు అస్తమిస్తున్నాడల్లే ఉందే !' అని హాస్యోక్తిగా అనసుకూడా అంది

అయితే ఆమె మాటలను బొత్తిగా వినిపించుకోనట్లే నటించాడు అతడు పైగా అవతల ఏవో రాచకార్యాలు మునిగిపోతున్నట్లు త్వరపడి స్నానం చేయటానికి ఆయత్తమయ్యాడు అందుకుగాను బాల్చీనిండా తనే నీళ్లు తోడుకొని బాత్‌రూమ్‌లో బుడబుడ పోసేసుకున్నాడు ఒంటిమీద తీరా తుడుచుకోవటానికి టవలు చూస్తే లేదు రుద్దుకోవటానికి సబ్బయితే తెచ్చుకున్నాడుగానీ టవలు మరిచిపోయాడు అలవాటులేని ఔపోసన కద మరి !

తన తొందరకొద్దీ అక్కణ్నుంచే కేకవేశాడు గోపాలరావు, "టవల్ టవల్" అని అది ఫలానవారిని ఉద్దేశించినట్లు లేదు అలాగే దానికి జవాబూ లేదు ఎవరినుంచీను

"అమ్మా, శ్యామూ టవల్ టవలమ్మా అన్నాడు ఈసారి శ్యామల గదిలో కూర్చొని చదువుకొంటూండటం ఇందాకే చూశాడు అసలతడు భార్య కామేశ్వరికంటే కూతురు శ్యామలనే ఏదైనా అడుగుతాడు

ఎందుకంటే భార్య కంటబడిందంటే అతడి మెదడు పూర్తిగా పనిచేయటం మానివేస్తుంది ఆమె ఎత్తుకొచ్చేది ఒక సమస్యా ? ఎన్నో !

'పెద్దాడు రాముడు ఏం చేశాడో చూశారా ? వాడి విషయంలో మీరు యికనైనా కలిగించుకోకపోతే ఎలాగండీ ?' అంటుంది 'కిష్టిగాడు ఈసారి కూడా ఆ ఇంటర్వ్యూలో సెలక్టు కాలేదుట మీరేకనుక కొంచెం శ్రద్ధ తీసుకొనివుంటే వాడికి తప్పకుండా వచ్చేదట ఆ ఉద్యోగం' అంటుంది 'చిన్నాడు చూశారా ? వాడు మరీ ఆకతాయి వెధవయిపోతున్నాడు ఎటూ కాకుండా పోయిన పెద్దాణ్ణి గురించే ఒక చెంప ఏడుస్తుంటే రెండోవాడు వీడు తయారయ్యాడు బలాదూర్ తిరుగుళ్ళకు — వాడు మొన్న రాత్రనగా వెళ్ళాడు — ఇంతవరకు ఇంటికి రాలేదు ! ఏమయిపోయాడో ఏమో — కొంచెం ఆచూకీ తీద్దురూ' అంటుంది చివరకు 'నా మాట విని అమ్మాయిని మన ఇంటవంట లేని ఆ కాలేజీ చదువులు మాన్పించి ఎవణ్నో ఒకణ్ని చూసి ఆ మూడు ముళ్ళూ వేయించవేద్దురూ మహానుభావా !' అంటుంది

అందుకే ప్రొద్దుట లేచింది మొదలు సాధ్యమయినంతవరకు తన అన్ని పనులు కూతురు శ్యామలకే అప్పగిస్తాడు ఒక్క భోజన సమయం



లోనే అతని కళ్ళముందు కా ౦పు ఎల
కామేశ్వరి   గోపాలరావు భోంచేసేటప్ప
పెదవి కదపదు  ఎందుకంటే లోగడ అత
ముందు కూర్చొని ఉండగా నోరు
మాటంటే వెంటనే లేచి చేయి కడు
అదో గట్టి హెచ్చరికగా మిగిలింది

కూతురు వచ్చేలోపల ' ౦ సల్యా సు
పూర్వా సంధ్యా ప్రవర్తతే " అంటూ
టేశ్వర సుప్రభాతం ఎత్తుకున్నాడు య

"అదేమిటి నాన్నగారూ, సాయం

బడుతుంద
డు ఆమె
డు విస్తరి
ారి ఏదో
ప్కన్నాడు

పజారామ,
శ్రీ వేంక
ాలాపంగా
ం పూట

సుప్రభాతమ్ చదువుతున్నారు' – టవలు అందిస్తూ నవ్వుతూ అడిగింది శ్యామల

"అదా! ఏమిటో గుర్తుకు వచ్చి ఆ దేవదేవుణ్ణి తలుచుకొంటున్నానమ్మా" అంటూ ఒక విధంగా కూతురి ముందు సిగ్గుపడ్డాడు గోపాలరావు 'అవునుమరి సాయంత్రంపూట సుప్రభాతమేమిటి!?' అనుకొని

"సరేగాని, ఎందుకు నాన్నగారూ అంత తొందర పడ్డారు? నాతో చెబితే నేను తోడిపెట్టేదాన్ని కద నీళ్ళు" అంది శ్యామల ముఖం చిన్నదిగా చేసుకొని

"అదిగాదమ్మా అవతల త్వరగా వెళ్ళవలసిన పనుంటేను అదీ కాకుండా ఇకనుంచయినా నా పనులు నేను చేసుకోవటం అలవాటు చేసుకుందామని బుద్ధి పుట్టింది"

"అంటే గాంధీ మహాత్ముడి సిద్ధాంతా

చింది ఆమె ఏదో అనబోతున్నా వినిపించుకోకుండా ముందుకుపోయి స్టాండుకున్న బట్టలు తీసి వేసుకోసాగాడు

ఈలోగా శ్యామల ముస్తాబయివచ్చి, "నాన్నగారూ, మీరు బోసురోడ్డువైపు వస్తారా?" అడిగింది

"అటుకాదు నేను వెళ్ళేది అయినా అక్కడెవరున్నారమ్మా?" అడిగాడు గోపాలరావు వెనుకవైపు పంచె కుచ్చెళ్ళు సరిచేసుకుంటూ

"ఒక ఫ్రండ్ వుంది వారం రోజులైంది అది నా నోట్స్ ఒకటి తీసుకువెళ్ళి కాలేజీకి తీసుకురమ్మనమంటే తీసుకురాదు దగ్గరలోనే పడ్డయ్ సెకండ్ టర్మ్ ఎగ్జామినేషన్స్" అంటూ కొంత భయభక్తులను అనునయించింది శ్యామల

గోపాలరావు మనసులో లోకంపోకడను బట్టి



ల్లోకి దిగారా? మీ అన్ని పనులూ మీరు చేసుకోవాలనుకొనేనా తుడుచుకొనేందుకు టవలు మర్చిపోయి వచ్చారు?" – మరోమారు సన్నగా నవ్వింది శ్యామల

"మరి ఇది నా మొదటి ప్రయత్నం కదమ్మా ఏదో పొరబాటు జరగటం సహజం" తనూ నవ్వాడు

తడి పొడిటవలు కట్టుకొని లోలోపల అడుగు పెట్టిన అతనికి 'స్టౌ' ముందు కామేశ్వరి కనిపిం

కొన్ని అనుమానాలు కలక్క మానలేదు అదేదో సినిమాలోలా స్నేహితురాలని చెప్పి — ఎవరయినా స్నేహితుణ్ని కలుసుకోవటానికి వెళ్లటంలేదుకద? మొన్న — ఈమధ్యనే—సాగర్ టాకీసు దగ్గర ఎవరో అమ్మాయి వంటరిగా నడచివెళ్తుంటే ఒక టాక్సీలో నలుగురు రౌడీలు వచ్చి బలవంతానా ఎత్తుకుపోయి ఆ శాల్తీనే మటుమాయం చేసిన సంఘటన — ఆనోటా యీనోటా తన చెవులదాకా వచ్చింది ఆ సంగతి మరి శ్యామల? కాలేజీకంటే నలుగురుంటారు కూడా ఇపుడు వంటరిగా ఛీ ఛీ తను పొరపాటుగా ఊహిస్తున్నాడేమో? నిజానికి తన కూతురు రత్నం మొదట్నుంచీ దాని ప్రవర్తన తనకు తెలియదూ? మగపిల్లల కంటే కూడా బాగా చదువుతుంది దాని ప్రోగ్రెస్ రిపోర్టు చూసి యిన్నేసి మార్కులు వచ్చింది తన బిడ్డ శ్యామలకేనా అని ఎన్నిసార్లు ఆశ్చర్యపోలేదు? దాని ధ్యేయం చదువే విద్యా వివేకాలు కల తన కూతురు ఎలాంటి పరువతక్కువపనీ చేయదు బుద్ధి వక్రించనంతవరకు దేవుడు దానికెలాటి కీడు తలపెట్టడు అదివుడు వెళ్లేది కేవలం నోట్సు పుస్తకానికే అంతే

"సరే వెళ్లమ్మా నేను వేరే పనిమీద మరో దారి పోతున్నాను త్వరగా వెళ్లి త్వరగా వచ్చేయ్ ఏం?" అన్నాడు బుజ్జగింపుగా

"ఏమిటి? ప్రొద్దుగూకి అదెక్కడకు వెళ్లేది? మీరెటు ప్రయాణం?" అంటూ వేడి వేడి కాఫీ గ్లాసుతో వచ్చింది కామేశ్వరమ్మ

"నా సంగతి నీకెందుకులేగాని, అమ్మాయి మాత్రం తన స్నేహితురాలింటికి వెళ్తోంది ఆ అమ్మాయి దగ్గర ఏదో పుస్తకం దిగడిపోయిందట — తెచ్చుకుంటానంటే సరే అన్నాను" అన్నాడు దస్తీమడత చొక్కా జేబులోకి సర్దుకొంటూ

"నోట్సు పుస్తకమా? రోజుకొక నోట్సు పుస్తకం స్నేహితురాళ్ల దగ్గర దిగబడిపోతుంటుందా? దానికోసమని ప్రతి సాయంత్రం యిది ప్రత్యేకంగా వెళ్లి తెచ్చుకోవాలా? ఏమండీ, మీకు తెలియదు రోజూ నెత్తి నోరు మొత్తుకుంటున్నా అది నామాట వినటంలేదు మీరయినా చెప్పి దాన్ని దార్లో పెడతారనుకొంటే అది అడిగిందే తడవు సరే వెళ్లమంటున్నారా? రేపు ఏటొచ్చి ఏం పోయినా"

"నా భార్య నడగకండి నన్ను అడగమంటాను నలుగురితో సరేనా?" అని రుసరుసలాడుతూ ఆమె చేతిలో కాఫీ గ్లాసు అందుకున్నాడు

మరి అక్కడుంటె తల్లి యింకేం హిరింగులు తీస్తుందో, తండ్రి మనసు ఏవిధంగా మారుతుందో—అసలైతే ఒప్పుకున్నాడు ఇంతే చాలన్నట్టు బయటకు జారుకొంది శ్యామల

"మిగిలినవాళ్లు ఎక్కడ తిరిగినా, ఏంచేసినా— మనం పట్టించుకున్నా, పట్టించుకోకపోయినా వాళ్లు మొగపిల్లలు వాళ్లను గురించి నాకు అంత బాధలేదు కానీ, శ్యామల ఆడపిల్ల ముల్లు వెళ్లి దానిమీద పడ్డా, అది వెళ్లి ముల్లుమీద పడ్డా చెరుపు ఆరిటాకుకేనని గుర్తుంచుకోండి ఈ విష

# ఈ సంఘంలో కుటుంబమే ఇది

యంలో మీరిప్పుడు అశ్రద్ధచేస్తే — చేతులు కాలాక ఆకులు పట్టుకున్న చందమవుతుంది"

"అవన్నీ నాకు తెలుసులేగాని వెళ్ల వెళ్ల—" అని అసహనంగా ఖాళీ అయిన కాఫీ గ్లాసును ఆమె చేతిలో విసురుగా పెట్టి తమా బయటకు వచ్చేశాడు గోపాలరావు

రోడ్డుమీదకు వచ్చి చూస్తే శ్యామల కనిపించ లేదు 'వెళ్లిపోయి వుంటుందిలే తన మిత్రురాలి యింటికి' అని తాపీపడ్డాడు ఆ తర్వాత అతడి ఆలోచనలు గృహ వాతావరణం నుంచి మళ్లి పోయాయి పూర్తిగా

అడుగులు ముందుకు పడుతుంటే తన కొలీగ్స్ రాజారావు, మాధవరావు, కోదండాలు గుర్తుకువచ్చారు

తన ఆఫీసులో పూర్తిగా చెడిపోయిందెవరయ్యా

---

## రాజీ!

"తిరగేశా నెన్ని చరితలో!
తెలకించా నెన్ని పుటలో!
తిరిగా నెన్ని పూరులో! అన్నింటా
తిమిరంలో సమరాలే!'
తిరుగులేని శాపాలే — పాపాలే!
తిధివారాలు లేకుండా కష్టాలే — నష్టాలే!
నిండుగ నవ్విన వాడొకడు లేడు
నిబ్బరముగ తిన్నవాడు ఎపుడు లేడు
నిజముగ జీవించువాడు ఎక్కడ లేడు
భయ మెరుగని బ్రతుకు లేదు!
భళియన్న శుభ ఘడియ లేదు!
బాధలు ప్రతిచోట రగిలాయి
గాధలు ప్రతి ఇంటా మిగిలాయి! అందుకే
తిరిగేయను తదుపరి పేజీ
తప్పదు ఈ బ్రతుకుతో రాజీ"

—త్రివిక్రమ్

---

అంటే కోదండం అంటారు అందరూ అలా అని అతడూ ఒప్పుకుంటాడు త్రాగుతాడు, వ్యభిచరిస్తాడు ఇదీ కాదనడు అతడికి పెళ్లయిందీ లేనిదీ ఎవరికీ తెలియదు నేను బ్రహ్మచారినీకాను, గృహస్థుణ్నీ కాను ప్రస్తుతం వంటరివాణ్ణి అంతేనంటాడు అడిగినవాళ్లతో ఒంటరివాడు కాబట్టి కోదండం ఇల్లే అనూళ్లో చాలామంది ఆఫీసు ప్రాణులకు విశ్రాంతి గృహం చతుర్ముఖ పారాయణ పిచ్చివాళ్లంతా సాయంత్రం ఆరయ్యేసరికి అక్కడకు చేరతారు రాత్రి ఏ పదిగంటలకో తమ దారిన తాము పోతారు గోపాలరావు ఆఫీసు ప్యూను భద్రం అక్కడ ఓవర్‌టైమ్ డ్యూటీ చేసి చివరకు అందరి దగ్గర తలో రూపాయో, అర్ధో చేజిక్కించుకొని యింటికి చేరుకుంటాడు అక్కడ అందరి కంటే అతడి సంపాదనే బాగుంది

ఇక గోపాలరావు డెయిలీ కస్టమర్ అక్కడ అలా అని అతడు రోజూ ఆడడు నెల మొదట్లో జేబులో నాలుగు డబ్బులు దండిగా ఉన్నప్పుడే వరుసగా ఓ వారంరోజులు ఆడేస్తాడు ఎంతకూ పోవటమేకాని రావటం అతని జాతకంలోనే లేదు తర్వాత ఖాళీఅయిన జేబులను తడుముకొంటూ ప్రేక్షకుడిగా అక్కడే కూర్చుండిపోతాడు అలవాటు కొద్దీ ఒకవేళ ఎవరయినా కోరితే వాళ్ల ప్రక్కన కూర్చొని సజెషన్సు యిస్తూ తనూ ఆడుతున్నట్లే తృప్తిపడుతుంటాడు ఒకప్రక్క అయినా పాడు మనసు — మళ్లీ ఫస్టుతారీఖు ఎప్పుడా ఎప్పుడా అని పరితపిస్తూనే వుంటుంది మరోప్రక్క

అది ప్రతినెల కార్యక్రమం ఈసారి అలా కాకుండా నెల మధ్యలోనే అతనికి లక్ష్మీప్రసన్నం జరిగింది కొన్ని నెలలుగా పెండింగ్‌లో పడివున్న అతని ఎరియర్స్ బిల్లుమీద నిన్న ఓ సంతకం పడేశాడు వాళ్ల ఆఫీసరు అది ఈవేళ క్యాష్ అయి చేతికి వచ్చింది జీతంఅంటే వచ్చినరోజు సాయంత్రమే తనకు అవసరమనుకున్న కొంత మొత్తం జేబులో వుంచుకొని మిగిలినవి భార్య చేతిలో పెట్టేవాడు అంతే ఇక యింటివిషయం పట్టించుకొనేవాడు కాడు కామేశ్వరమ్మ పొదుపుగావాడి నెలంతా, గడిపేది ఆ డబ్బుతో

ఈసారి మాత్రం గోపాలరావు ఎప్పటిలా తనకు వచ్చిన డబ్బు భార్య చేతిలో పెట్టకపోవటం సరికద అది వచ్చినట్లుకూడా చెప్పలేదు ఎందుకంటే ఈమధ్య అతడు (విలాస గృహంలో) తన మిత్రుల నుంచి సూటిపోటి మాటలు ఎదుర్కొంటున్నాడు జేబులో తడిలేని అతన్ని దద్దమ్మనుచేసి తీసిపారేస్తున్నారు నలుగురూ అప్పట్నుంచీ అతడి హృదయం పౌరుషంతో దహించుకుపోతోంది చేతినిండా డబ్బులు ఎప్పుడు వస్తయ్యా వీళ్ల పొగరు ఎప్పుడు అణుస్తానా అనే ఎదురు చూస్తున్నాడు గోపాలరావు కొన్నిరోజులుగా అదీకాక పాతికలు యాభైలు ఎప్పుడూ వాళ్లకు వీళ్లకూ తనవి పోవటమేకాని తనకు ఓ పదిరూపాయలు ఒకళ్లవి వచ్చిన పాపాన పోలేదు కంటిన్యూగా ఆడితే తన చెయ్యా మెలి తిరిగేదేమో — తనకా భాగ్యం లేకపోయె ఇంతకాలం కాబట్టి యిప్పటి ఈ డబ్బును కేవలం ఆటకే వినియోగించి పోయిన తన డబ్బంతా రాబట్టుకోవాలని పట్టుబట్టాడు ఒకవేళ ఇవి పోతయ్? పోతే పోనీ! దీంతో సరి ఇక్కడికి రావటమే మానుకుంటాడు అని దృఢంగా నిర్ణయించుకున్నాడు ఆఫీసులో డబ్బులు అందుకొంటున్నప్పుడే — అలాగే త్వరపడి చేరవలసిన చోటుకు చేరుకున్నాడు—

గాంధీ రోడ్డులో వున్న కోదండం యిల్లు ఎప్పటిలానే స్వాగతం పలికింది గోపాలరావుకు అతడికి చెత్తబుట్టతో మొత్త దగ్గరే ఎదురయ్యాడు భద్రం — "ఏమోయ్ వచ్చారా అంతా?" అడిగాడు ఆత్రంకొద్దీ

"వచ్చారు సార్ అంతా మీకోసమే ఎదురు చూస్తున్నారు" అని వినయం వుట్టిపడేలా చెప్పి బజారు చెత్త కుండీవైపు వెళ్లాడు భద్రం ఎప్పుడూ జేబులో డబ్బులుండవని గోపాలరావును చూస్తే అతడికీ తేలిక భావమే అక్కడున్న నలుగురితోపాటు ఓ కాఫీ తెచ్చిపెట్టాలన్నా, ఓ సిగరెట్ అందించాలన్నా తన రక్తమాంసాలు ధారపోస్తున్నట్లే బాధపడిపోతాడు పైగా ఆ వ్యక్తి ముందుకు పోతుంటే తను వెనకాలవుండి నవ్వుతాడు అతడు



ప్రపంచ తెలుగు మహాసభలలో ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారిని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం, రాష్ట్ర విద్యా మంత్రి శ్రీ మండలిగార్లు సన్మానిస్తున్న దృశ్యం

ఈవేళ అయ్యగారి చేతికి డబ్బు అందినట్లు వాడికి తెలుసు ఆయన్నుంచి రూపాయో అర్ధో రాబట్టుకోవటానికే ఆ వక్రవినయం

రోజూ అయితే అక్కడివాళ్లు ఆట మొదలు పెట్టటానికి గోపాలరావుకోసం ఎదురుచూసేవాళ్లు కారు కానీ సహోద్యోగులు కనుక వాళ్లకూ తెలుసు, అతడి చెయ్యి ఈవేళ తడిసిందనీ, కాబట్టే ఆటలో తప్పక పాల్గొంటాడనీ అందుకే అతడు వచ్చేవరకు బాతాఖానీ కొట్టుకుంటూ కూర్చున్నారు అంతా.

గోపాలరావు వచ్చి అందరిమధ్య సగర్వంగా కూర్చున్నాడు — ఆలస్యం చేయకుండా మాధవ్రావు ముక్కలు కలిపి వేశాడు —

అదేం చిత్రమో — ఆటలన్నీ గోపాలరావువే ఆవేళ !

తను ఇంటినుంచి బయలుదేరిన వేళావిశేషం మంచిది 'ఇన్నాళ్లనుంచీ తన పోయిన డబ్బులన్నీ వచ్చేస్తున్నయ్ ఇప్పుడు' అని ఒకటే మురిసిపోతు న్నాడు అయితే, అతడి మనసులో ఉన్నట్లుండి ఒక ఆలోచన తళుక్కున మెరిసింది—

లోగడ ఇలాగే ఒకసారి—ఆవేళా ఆటలో చాలా డబ్బు వచ్చింది అయినా ఆత్యాశకుపోయి ఆడాడు—చివరకు ఇంటిముఖం పట్టేసరికి ఖాళీ జేబులే మిగిలాయి ఈవేళా అప్పటిలా జరుగుతుందేమో ? ఆ భయంతోటే కొంత మొత్తం వచ్చాక తృప్తిపడి 'ఇక నేను ఆడటంలేదు' అనేశాడు

"ఏం ?" — రాజారావు కనుబొమ్మలు అంతలోనే ముడిపడ్డాయి

పైకి ఏమీ అనకపోయినా మాధవరావు ముఖం ఎఱ్ఱబడింది

"నాకు తలనొప్పిగా వుంది" అన్నాడు గోపాలరావు రెండు కణతలూ నొక్కుకుంటూ

"తలనొప్పి బిళ్ల, కాఫీ తెస్తాను ఓ రూపాయి ఇటు పడెయ్యండిసార్" అన్నాడు ప్రక్కగా నిలబడ భద్రం

అతడి మాటలు విన్న గోపాలరావుకు అరికాలి మంట నెత్తికెక్కింది ఇదే ఆఫీసులో అయితే ఓ యస్ (ఆఫీసు సూపరింటెండెంట్)గా తన కున్న అధికారాలన్నీ ఉపయోగించి ఏమైనా చేసే వాడు భద్రాన్ని కానీ, ఇది కోదండం యిల్లాయి పోయింది

"పోని నేనిచ్చి పంపుతాను" అన్నాడు మాధవరావు రూపాయికాగితం తీసి

"అదికాదు—నాకిక ఆడాలని ఇంట్రస్టులేదు కావాలంటే రేపు ఆడదాం " అన్నాడు గోపాలరావు

"రేపెందుకు ? ఇప్పుడే ఆడదాం అందులో నీ చెయ్యికూడా మెలితిరిగిందికద ఈవేళ ?" అన్నాడు రాజారావు

"ప్లీజ్ నన్ను ఈవేళ మాత్రం మరి బలవంతపెట్టకు రాజారావు " అన్నాడు గోపాలరావు మొండిగా

"మా అందరిదగ్గర డబ్బు నీచేతికి వచ్చేసిందనా ? నీవే పోతే మేమలా చేస్తామా ?" అన్నాడు మాధవరావు

అంతటితో గోపాలరావుకు లోగడ ఓ సంఘటన టక్కున గుర్తుకు వచ్చింది ఒకసారి ఫస్ట్తారీఖు ఏకమొత్తంగా యాభై రూపాయలు పోయాయి కోదండం దగ్గర అయిదు రూపాయలు అప్పుగా తీసుకొని నేనింకా ఆడతాను అన్నా వినిపించుకోకుండా మాకు పని వుందంటే మాకు పని వుందని ఎవరికివారు లేచిపోయారు, ఈ రాజారావు, మాధవరావులే

"ఏమో అదంతా నాకు తెలియదు నాకు పని వుంది ఇంటికి వెళ్లాలి " అంటూ లేవబోయాడు

కానీ, మాధవరావు గోపాలరావు చెయ్యి పట్టుకొని గట్టిగా లాగాడు ఆ లాగుడుకు ముందుకు పడబోయి ఎలాగో తమాయించుకు నిలబడ్డాడు అతడు

"ఇంటికి ఎలా వెళ్తావో మేమూ చూస్తాం" అన్నాడు రాజారావు గట్టిగా సిగరెట్‌దమ్ము లాగుతూ

"సరే, దౌర్జన్యం చెయ్యండి అదెంతవరకో నేనూ చూస్తాను " పౌరుషంగా ఒక అడుగు ముందుకు వేయబోయాడు గోపాలరావు,

దాంతో రాజారావు, మాధవరావులు ఆవేశంగా లేచి నిలబడ్డారు — డబ్బులుపోయిన కడుపుమంటతో వాళ్లు గోపాలరావును ఏం చేసేవాళ్లో, అతను వాళ్లను ఏం చేసేవాడో—కానీ, మధ్యలో కోదండం కలిగించుకోవటంతో ఆ గొడవ ఒక దారికి వచ్చింది

"రాజారావుగారూ ! - తొందరపడకండి ఇది ఆట, ఇందులో ఎవరి డబ్బు పోతుందో, ఎవరివి ఎవరికి వస్తాయో ఎవరికీ తెలియదు । గోపాలరావుగారి డబ్బులు ఎన్ని ఎన్నిసార్లు పోలేదు ? ఎన్నిసార్లు మనకు రాలేదు ? ఒకసారి ఆయన డబ్బులన్నీ పోయినప్పుడు నాదగ్గర అయిదు రూపాయలు అప్పు తీసుకొని 'నేనింకా ఆడతాను' అంటున్నా వినిపించుకోకుండా వెళ్లిపోయారు మీరు అప్పుడాయన ఎందుకు ఆడరని మిమ్మల్ని నిలవేసారా ? క్రితంలో ఒకసారి ముకుందరావు కొత్తగావచ్చి ఆడాడు ఆనాడు అందరి డబ్బులూ గెల్చి ఆట మధ్యలోనే లేచిపోలేదూ అతడు ? ఆవేళ ఇంకా ఆడతానని నేనే అన్నాను అయినా విన్నాడా ? మీరు మాత్రం నిలబెట్టగలిగారా ఆ ముకుందరావుని ? అసలు గోపాలరావుగారిమీద అలా ఒంటికాలుమీద ఎలా లేవగలుగుతున్నారో మీరు నాకు అంతుబట్టకుండా వుంది " అన్నాడతడు

త్రాగుబోతువైనా, వ్యభిచారివైనా నీలో నీతి నిజాయితీ లున్నాయోయ్ కోదండం — అతడంటే మంచి అభిప్రాయ మేర్పడింది గోపాలరావుకు ఆ మరుక్షణం ఆ తర్వాత ఆనాడు ముకుందరావు కొత్తగా వచ్చి ఆడిన - ఆ సంఘటన మెదిలింది అతడి మనసులో కోదండం అన్నట్లు మరి ఆ ముకుందరావును ఏమీ అనలేనివాళ్లు తన్ని యెలా నిలవేయగలిగారు వీళ్లీనాడు ? దీన్ని గురించే గట్టిగా ఆలోచించటం మొదలుపెట్టాడు గోపాలరావు

కోదండంతో పేచి పెట్టుకోవటం ఇష్టంలేకే కొంత వెనక్కుతగ్గారు మాధవరావు, రాజారావులు కానీ, మాధవరావు ఒకమాట అన్నాడు,

"నీవింత కుత్సితుడవని అనుకోలేదు గోపాలరావు మరెప్పుడూ మాతో ఆట్టానికి రాకిక్కడకు" అని

ఆ మాట వినేసరికి గోపాలరావు అభిమానం పూర్తిగా దెబ్బతినిపోయింది వెధవ పేకాట — ఈనాడు డబ్బును గురించి తను ఒకడితో మాట పడటమా ? — దీనిమీద పిచ్చిఆవేశం వచ్చి జేబులో డబ్బులన్నీ తీసి తనది మాత్రం లెక్కపెట్టి తీసుకొని మిగిలినది క్రింద విసిరికొట్టాడు

"మిస్టర్ మాధవరావు ! మిస్టర్ రాజారావు ! ఈ డబ్బును గురించి మనసును చంపుకొనేంతటి హీనుణ్ణి కాను నేను ఆత్మాభిమానం కోసం అవసరమైతే ప్రాణమైనా వదులుకుంటాను భవిష్యత్తులో ఇంత జరుగుతుంది, మీరింతకు తెగిస్తారు అని సూచనామాత్రంగానైనా ఊహించుకోగలిగివుంటే ఈ చాయలకు కూడా



"శ్రీకృష్ణ జరాసంధ"లో రామకృష్ణ

# సినిమా

(23 వ పేజీ తరువాయి)

### కాశీనాథ్‌కు మరో కిరీటం

కాశీనాధుని విశ్వనాథ్‌గారి చిత్రమా! చాలా బాగా తీస్తాడయ్యా! చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా, సింపుల్‌గా, అందరికీ అర్థమయ్యే విధంగా చిత్రించే నేర్పు వుందతనికి. అనే ప్రశంసా వాక్యాలమ ఏనాడో సంపాయించుకున్నారు దర్శకుడు విశ్వనాథ్. వారి చిత్రం వస్తుంది అంటే ప్రేక్షకులు ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తుంటారు.

వారి ఆసక్తి కనుగుణంగా విశ్వనాథ్‌గారి మరో రసవత్తర చిత్రం వస్తోంది ప్రజల ముందుకు బాక్సాఫీస్ చిత్ర నిర్మాత డి. వి. యస్. రాజుగారు కలర్‌లో నిర్మించిన "జీవన జ్యోతి" చిత్రానికి విశ్వనాథ్‌గారే నిర్దేశకులు. చిత్రం చూస్తున్నంత సేపు, విశ్వనాథ్‌గారి మేధస్సు గుర్తుకొస్తూనే వుంటుంది. చిన్న విషయాన్ని గూడా, అలక్ష్యం చేయకుండా, ఎంత జాగ్రత్తగా తీసారబ్బా! అన్పిస్తుంది. ఏ ఘట్టాన్ని పరికించినా, వారి కాన్‌సంట్రేషన్ కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. "జీవనజ్యోతి" చిత్రం నిర్మాతకు ధనప్రాప్తిని, దర్శకునికి కీర్తి కిరీటాన్ని తెచ్చిపెడుతుందనడంలో అతిశయంగానీ, అతిశయోక్తిగానీ లేదు.

ఇక తారాగణాన్ని చూస్తే, శోభన్, వాణిశ్రీ, సత్యనారాయణ, రాజబాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య, నిర్మల, వుండగా ఆయా పాత్రల గురించి ఇక చెప్పాలా!

సాంకేతిక శాఖలైన సంభాషణలకు సముద్రాల, సంగీతానికి మహదేవన్, ఛాయాగ్రహణానికి జి. కె. రాము, కళకు కళాధర్ వుండగా, ఆ శాఖలకు ఇంకేం తక్కువ?

విజయా ద్వారా ఈ చిత్రం మేలో విడుదలౌతుంది

---

వచ్చేవాణ్ణి కాను మించిపోయిందిలేదు. జరిగిపోయిందొక పీడకలగా మరిచిపోతాను . . ఎవరిడబ్బు ఎంతో తీసుకోండి . . కోదండం! ... నీకు నా థాంక్స్ ఈ పేకాటమూలంగా నేను కుళ్ళితుణ్ణాయి పోయాను ఇక్కడ .. ఈ ధర్మపరుల దగ్గరకు నేనింక రాదలచుకోలేదు . వస్తాను..." అని విసవిస బయటకు వచ్చేశాడు అక్కణ్ణుంచి

వ్రతం చెడ్డా ఫలం దక్కిందన్న సంతోషంతో ఎవరి డబ్బు వాళ్ళు తీసుకున్నారు మాధవరావు, రాజారావులు కోదండానికి రావలసింది యిచ్చారు కానీ, వాటిని అతడు తీసుకోకుండా భద్రానికిచ్చాడు

గోపాలరావుగారి గొడవమూలంగా ఈవేళ ఏమీ గిట్టుబాటుకాకుండా పోయిందేమా, ఇంటికివెళ్ళి తన పెళ్ళానికి ఏం సమాధానం చెప్పాలి? ఉత్త చేతులతో వెళ్తే 'వచ్చిన డబ్బులతో ఎక్కడ తాగితందనాలాడొచ్చావో చచ్చినోడా' అని అభాండంవేసి ఏం గలాటా చేస్తుందో రత్తాలు అని లోలోపల ఏడుస్తున్నవాడికి కోదండం ఆ డబ్బులు యివ్వటంతో ప్రాణం తెప్పరిల్లినట్లయింది

హుషారుగా ఎక్కడి సామాన్లు అక్కడ సర్దేసి కోదండానికి చెప్పి వెళ్ళిపోయాడు భద్రం

అందరూ వెళ్ళిపోయాక ఒక్కడూ కూర్చొని ఏదో దీర్ఘంగా ఆలోచించటం మొదలుపెట్టాడు కోదండం

*　　*　　*

కోదండం ఇంటినుంచి బయటకు వచ్చాక కూడా గోపాలరావు మనసు ఉక్రోషంతో కుతకుత ఉడికిపోతూనే వుంది . రాజారావు, మాధవరావులు అలా మ్యానర్స్ లేకుండా ప్రవర్తించారేమిటి? . . పైగా తననేమో చేద్దామని ఒంటికాలుమీద లేచారు! ఈ లీనియన్స్ ఎక్కడ ఏర్పడింది?

## ఈ సంఘంలో కుటుంబమే ఇది

ఆట సమయంలో ఎప్పుడూ ఒకళ్ళంటే ఒకళ్ళు మండిపడి మాటలు విసురుకొనే వాళ్ళు తన విషయం వచ్చేసరికి ఒకటి ఎలా అయ్యారు? . కోదండం అన్నట్లు ఆ ముకుందరావును — ఆనాడు ఎవరూ ఏం చేయలేకపోయారేం?

ఈ జరిగినదాని అర్థం? ముకుందరావు విషయంలో మాధవరావు, రాజారావుల ఉపేక్షకు కారణం? . డిజిగ్నేషన్ అందరిదీ ఒకటే. ఒకళ్ళకొకళ్ళు చుట్టాలుకారు. అయితే కులం . . అవును కులం . ఆ కులాభిమానమే ఆనాడలా చేసింది ఈనాడిలా జరిపించింది అసలు వాళ్ళనని లాభమేమిటి? . దేశం మొత్తమే అలా ఏడ్చింది.

పోనీలే తను మంచిపని చేశాడు మొహాన తన్నినట్లు వాళ్ళ డబ్బు వాళ్ళ ముఖాన కొట్టి వచ్చాడు ఏదో వ్యసనంకోసం ఆడటమేకాని ఈ ఆటల్లో డబ్బు గెలిచి సంసారాలు వెళ్ళదీయాలనా? డబ్బుకాదు కలకాలం నిలిచేది నోటి మాట...ఆ జూదగృహంలో అడుగు పెట్టనని తను ఇపుడు అన్నాడు ఆ మాట నిలబెట్టుకోవాలి ఇక .. కాముడు కోర్కె ప్రకారం ఆఫీసు అయిపోగానే సరాసరి ఇంటికే వెళ్ళి పిల్లలతో కాలక్షేపం చేస్తే? . అసలు యింటి విషయాలు తనకు అంతుపట్టకుండా తయారయ్యాయి. ఎవరెటు పోతున్నారో, ఏం చేస్తున్నారో—

– ఒక నిర్ణయానికి వచ్చాక అతడి హృదయం తాపీపడింది అయినా సరాసరి ఇంటికి వెళ్ళాలంటే ఎందుకో మనస్కరించిందికాదు గోపాలరావుకు ...

అప్పటికతడు-సెంటర్ వరకు వచ్చాడు తెలియకుండానే తలెత్తి చూస్తే ఎదురుగా సినిమా థియేటర్ రెండవఆట ప్రారంభవేళ ... అదేదో కొత్త సినిమా. చీమలబారుల్లా ఉన్నారు జనం క్యూలలో ... అన్ని కౌంటర్స్‌లో టిక్కెట్లిచ్చేస్తున్నారు ... అసలే వేగిపోయివున్న హృదయం వినోదం కోరుతోంది అది మంచి సినిమా అనిపించి ఎలాగైనా దానికి వెళ్ళితీరాలి అనుకున్నాడు . క్యూలో నిలబడితే టిక్కెట్లు అందే సూచన కనిపించలేదు అయినా వెళ్ళి లైనులో నిలబడదామని ఒక అడుగు ముందుకు వేశాడు

ఇంతలో ప్రక్కన పోలీసు నిలబడివున్నా ఋడవక బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మే కుర్రవాడొకడు వచ్చి "సార్, టిక్కెట్టు కావాలా?. కుర్చీ టిక్కెట్టు నాలుగు రూపాయలే" అని గోపాలరావును పూర్తిగా చూసి కొయ్యబొమ్మగా మారిపోయాడు. అతడి పెదవుల మధ్య కాలుతున్న సిగరెట్ అలాగే క్రిందకు జారిపోయింది

ఇక గోపాలరావు అవస్థ చెప్పనలవికానట్లు తయారయింది. బి పి ఎక్కువైన రోగిలా వణికిపోతూ 'రామిగా' అన్నాడు

ఆ బ్లాక్‌లో అమ్మే కుర్రాడు ఎలా తప్పించుకున్నాడో – ఎంతో యుక్తిగా జనంలో కలిసి మాయమయిపోయాడు

ఆపైన గోపాలరావు కొడుకును వెతికే ప్రయత్నం చేయలేదు. ఇక అక్కడ ఒక్క క్షణం కూడా నిలబడబుద్ధికాక ఆశాంతిగా బయలుదేరి ఎటెటో తిరిగి చివరకు నది ఒడ్డుకు వచ్చి కట్టమీద కూర్చున్నాడు.

తెల్లని వెన్నెల — నల్లని నీళ్ళు — చల్లని గాలి — చంద్ర కాంతిలో రాత్రినే పగలుగా భ్రమసి విహరిస్తున్న పక్షులు — ప్రకృతి శోభను గురించి ఏమాత్రం ఆలోచించటంలేదు. అతడి మనసంతా ఇపుడు సంసారం, ఇల్లు, పిల్లలు – వీళ్ళ చుట్టూనే, పరిభ్రమిస్తోంది.

[ఇంకా ఉంది]



సాధారణమైన ఏ చర్మమైనా
వేసవిలో ప్రిక్లీహీట్
బాధకు గురిఅవుతుంది.
STA'S-GN-410 TL




Glaxo
nycil*
PRICKLY HEAT
POWDER
SOOTHES AND
PROTECTS THE SKIN
గ్లాక్సో
వారి నైసిల్
*ట్రేడ్ మార్క్




ఉదయము స్నానము
తర్వాత శరీరముపై
నైసిల్ చల్లుకోండి...
ప్రిక్లీహీట్ బాధ
మీకు తెలియదు.
వైద్య పరీక్షల అనుసారం ఎక్కువ చెమట స్వేద గ్రంథులను మూసివేయటము వల్ల ప్రిక్లీహీట్ వస్తుంది. దురద, బాధ కలుగుతుంది. ఇది ఇలా వ్యాపిస్తూనే ఉంటుంది. క్లోరోఫెనెసిన్ మరియు బోరిక్ పౌడర్ కల్గిన నైసిల్ 'బ్లూ' మాత్రమే దీనిని ఆపగలదు. ఇంకా ఇందులో మిశ్రితమైన జింకు ఆక్సైడ్ శరీరమునకు ఉపశాంతి మరియు రక్షణ ఇస్తుంది.



'మాపూరి గంగ' లో లక్ష్మి.

# సినిమా

## అంతా నవరక్తం

కనకదుర్గా కంబైన్స్ అనే నవ చిత్ర నిర్మాణ సంస్థ బ్రతుకే మాయ అనే చిత్రాన్ని నిర్మిస్తోంది. ఆ చిత్రంలోని పాత్రలకు అందరూ కొత్త వాళ్నే ఎన్నుకున్నారు నిర్మాతలు యస్. కుంతలా రామనాథ, టి. ఎ. ఎస్. నాయుడు.

రాజకుమార్, ఉషాచౌదరి, జయానంద్, జయప్రకాష్, ఎ. సుందరం, టి. ఎ. ఎస్. నాయుడు, చలపతిరావు, శశిరేఖ, ఉషాఖన్నా ఇవే కొత్తవాళ్ళ నామధేయాలు.

కండబలంతో కసాయిగా ప్రవర్తిస్తుంటాడు ఒక వ్యక్తి. అతని దుర్మార్గానికి స్వస్తి చెప్పంనే నాథుడే లేని సమయంలో ఓ ఆగంతకుడు ఆ వూర్లోకి వస్తాడు. అతని అహంకారాన్ని అదుపులో పెడతాడు. అనవసర ప్రసంగాలకు రాకుండా అడ్డగిస్తాడు. ఆగంతకుని సాహసానికి ముగ్ధురాలౌతుం దొక మగువ. అతన్ని ప్రేమించి పెళ్ళికూడా చేసుకుంటుంది. ఇదే బ్రతుకే మాయ చిత్రకథ.

దర్శకుడు ఎస్. వి. రావు ఈ చిత్రానికి ఎంతో నేర్పుతో, ఓర్పుతో ప్రేక్షక ప్రీతిపాత్రమయ్యే విధంగా రూపకల్పన చేస్తున్నారు. చిత్రం తుది మెరుగులు దిద్దుకుంటోంది.



"జీవన జ్యోతి"లో వాణిశ్రీ

## డ్రైవరితో పాప్‌సింగర్!

మనస్సులోని బాధను మరొక మనిషితో చెప్పుకుంటే అదొరకం తృప్తి. మొదటి చూపులోనే కొంతమందిపై సదభిప్రాయం ఏర్పడుతుంది. సాంగత్యం చేయాలనిపిస్తుంది. అలాంటి వారితో బాధను చెప్పుకున్నప్పుడు ఏదో తెలియని బరువు కాస్త తగ్గిపోయిందనే అన్పిస్తుంది.

వినయ్ ఒక టాక్సీ డ్రైవర్. లత ఒక పాప్ సింగర్. ఓసారి లత వినయ్ టాక్సీలో వెళ్ళడం జరిగింది. ఆ టాక్సీలో తన డైరీని మర్చిపోయింది లత. వినయ్ ఆ డైరీని లతకు తీసుకెళ్ళి ఇస్తాడు. ఆ సమయంలో ఇరువురిమధ్య యిలా సంభాషణం సాగింది.

లత: పోయిన వస్తువు మళ్ళీ దొరుకుతుందనుకోలేదు.

వి: తనదైనపుడు తప్పక దొరుకుతుంది.

ల: పోగొట్టుకున్న ప్రతి వస్తువూ మళ్ళీ దొరికే అదృష్టం వుండాలికదా! (మాటల్లో నిస్పృహ)

వి: పోయిన వస్తువు కళ్ళముందున్నా గుర్తించలేని అదృష్టహీనులున్నారమ్మా యీ లోకంలో.

వారి సంభాషణాన్ని వింటుంటే ఏదో పోగొట్టుకున్న వారిమల్లే అన్పిస్తుంది. ఏం పోగొట్టుకున్నారో! ఎలా పోగొట్టుకున్నారో! మళ్ళీ యెలా పొందగలిగారు? అనే ప్రశ్నకు సమాధానమే దర్శకుడు యం. మల్లికార్జునరావు రంగుల సృష్టి "రక్తసంబంధాలు". వినయ్‌గా చంద్రమోహన్, లతగా లత నటించారు.

రక్తసంబంధం అనేది ఒకనాటితో తీరిపోయేది కాదు. తెగిపోయేదికాదు. ఏనాటికైనా అది కలుసుకుంటుంది. నిజం తెలుసుకుంటుంది అనే సత్యాన్ని స్పష్టపరుస్తూ నిర్మింపబడిన చిత్రమే రక్తసంబంధాలు. ఈ చిత్రం మేలో విడుదల.

ప్రిన్స్ విజయ్‌గా హీరో కృష్ణ నటన టాప్‌గా వుంది. చిత్రంలో అతని అంతస్తును మరింత పెంచుతుంది ఈ చిత్రం.

( 47వ పేజీ చూడండి)

## అంతా మాయ  కార్యాలయంలో ఇంద్రజాలం

హైదరాబాదు. మొన్నీమధ్య ఓ రాత్రిగా ఒక అబ్బాయి మా ఆఫీసుకి వచ్చాడు. తెల్లగా పొడగా ఉన్నాడు — పొడుగు చేతుల పూల చొక్కా వేసుకుని ఉన్నాడు. అతను ఇచ్చిన విజిటింగ్ కార్డు మీద బి. కామేష్, మేజిష్యన్, మెస్మరిస్ట్ ఎండ్ ఇల్యూషనిస్ట్ అని ఉంది.

ఏమిటి సంగతి? అని అడగగా ఆయన తన సంగతి కొంచెం చెప్పుకున్నాడు. కామేష్‌ది కాకినాడ. బి. ఏ. చదువుకున్నాడు. ఒక కోయవాడి దగ్గిర ఇంద్రజాలంలో తరిఫీదు పొందాడు.

కామేష్ మరికొన్ని తమాషాలు చేసి చూపించాడు. అగ్గిపెట్టెనిండా పుల్లలు. మూసి తీస్తే అంతా ఖాళీ. ఇంకోసారి తెరిస్తే నిండా పుల్లలు!



(అగ్గిపెట్టె కాదు. అగ్గిపెట్టె ముందు వెనకా కూడా ఒకే లేబిల్! మళ్ళీ ఒక వయిపు మాయం.)

పేక ముక్కల మేజిక్కుల సంగతి సరేసరి! ఏ ముక్క తీసినా కామేష్ అనుకున్నదే మనం తీస్తాము.

ఆయన హైదరాబాదులో త్వరలో కళ్ళ గంతలు కట్టుకుని జీపు నడపబోతున్నాడుట. ఇంతకుముందే ఇటువంటి ట్రిక్కులు చాలా చేశాడు. ఎందరో ప్రముఖుల ముందు.

ఇలాగ చెప్పుకుపోతూ ఆయన గబుక్కున ఆగిపోయి ఈ కలం ఎంతండి? అని అడిగాడు.

ఏడెనిమిది రూపాయలు ఉంటుందేమో? అని మేము చెప్పగా — అబ్బే ఇంకా ఎక్కువ ఉండాలి! మూడు వందలయినా ఉంటుంది! చూడండి ఇందులో ఫారిన్ స్ప్రింగ్ ఒకటి ఉంది. ఆ సంగతి మీకు తెలీదు అవునా? అని ఆయన పెన్ను మూతని లాగి వదులుతూ ఉంటే అదే జరిగిపోతోంది. మనం తీసిచూస్తే మళ్ళీ పాత కలమే!

బి [కామేష్] అంటే ఏమిటి? అని అడగగా భావరాజు అని తెలిసింది.

అంటే అవును. ప్రసిద్ధ కార్టూనిస్టు (భావరాజు) సత్యమూర్తి కామేష్‌కి పినతండ్రి అవుతారు.

అంతా మాయ — మీ మనస్సులో నాకు కావలసిన మాయ సృష్టిస్తాను అని బి. కామేష్ చెప్పి వెళ్ళిపోయాడు!




# * భాగవతం - పండితుడు *

భాగవతం భగవంతుని అవతార గాథను తెలియజేసే పురాణ గ్రంథం మాత్రమే కాదు -గొప్ప వేదాంతగ్రంథంకూడాను దాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నవారు గొప్ప పండితులు ! మహాజ్ఞానులనిన్నీ చెప్పవచ్చును

ఒకప్పుడు భగవతాన్ని క్షుణ్ణంగా చదివిన విద్వాంసుడొకడు తన పాండిత్యాన్ని ప్రదర్శించి సన్మానం పొందాలనే సంకల్పంతో ఒక ప్రభువు వద్దకు వెళ్లి తాను గొప్ప పండితుడ ననీ, తన్ను సన్మానించాలనీ కోరాడు ఆ రాజా గొప్ప జ్ఞాని అతడు ఆ విద్వాంసుడితో— "అయ్యా మీరు మరొకసారి భాగవతం చదివి, అర్థం చేసుకుని రండి" అని పంపివేశాడు

తన పాండిత్యాన్ని రాజు శంకించినందుకు ఆ పండితుడు నొచ్చుకునినా, తనలో లోపం వున్నదేమో అని తలచి మళ్లీ ఆ మహా గ్రంథాన్ని చదివి, అర్థంచేసుకుని తిరిగి ఆ రాజును దర్శించాడు ఆ రాజు అప్పుడుకూడా తృప్తిచెందక "మీరు మరొకసారి భాగవతాన్ని బాగా చదివి, అర్థం చేసుకుని రండి" అని చెప్పి పంపివేశాడు

దీనితో ఆ పండితునికి నిరుత్సాహం అధిక మయింది అయినా, రాజు ఆరీతిగా చెప్పడంలో ఏదో అర్థం వుంటుందని గ్రహించి, అతడు ఎక్కువ పట్టుదలతో ప్రతివిషయాన్నీ చర్చిస్తూ ఆ మహాగ్రంథాన్ని పరింపసాగినాడు చదవగా, చదవగా ఆ పండితునికి ఉత్తమ మైన జ్ఞానం కలిగింది సంసారం మహా సముద్రమనీ, జననమరణాదులు, కష్టాదులు లేకుండా వుండడానికి భగవంతుని ఆశ్రయించ డమే ముఖ్యమనీ, అశాశ్వతాలూ, క్షణికాలూ అయిన లౌకిక సుఖాలకోసం, వాటికి కావలసిన డబ్బుకోసం ధనవంతులయిన రాజులను ఆశ్రయించడం సముచితం కాదనీ ఆయన బాగా తెలుసుకున్నాడు తనకు ఇటువంటి జ్ఞానం కలగడానికే రాజా తన్ను సన్మానించ కుండా జరుపులు పెట్టుతూ వచ్చాడని ఆ పండితుడు గ్రహించాడు

అందువల్ల ఆ తర్వాత అతడు రాజు వద్దకు వెళ్లాలని ఉబలాటపడలేదు మరి కొద్ది రోజులకు రాజువద్దకు ధనార్థియై వెళ్లకూడదనే దృఢనిశ్చయం చేసుకున్నాడు

ఈ విధంగా అతడు యదార్థమయిన భాగవత తత్వవేత్తగా మారిపోయాడు

ఆ పండితుడు తనవద్దకు తిరిగి రానందు లకు రాజునకు ఆశ్చర్యం కలగలేదు అతడు భాగవతాన్ని సరిగా అర్థం చేసుకుంటే తన దగ్గరికి ధనార్థియై రాడని రాజుకు బాగా తెలుసును

# సరికొత్త ప్రేమకథ "రాధ"



"నా గురించి చాలా అడిగి తెల్సుకున్నారు కదా.. మరిమీ గురించి ఏమీ చెప్ప లేదే" ఈసారి మాటలు చాలా సౌమ్యంగానే వున్నాయి

ఫర్వాలేదు తెలివిగానే అడిగింది.

"అయామ్‌సారీ .. మాటల్లో పరిచయం మాటే మర్చిపోయాను...నాపేరు...అయిదు సంవత్సరాలు చదువు వెలగబెట్టి ఓ మూడు నెలల్నుంచి నిరుద్యోగి అనే రోషసిని పోషిస్తున్న ఓ డాక్టర్ని ..." అన్నాను తమాషాగా.

"వా...ట్...మీరు డాక్టరా..." ఆశ్చర్య పడింది.

"ఏ...డాక్టర్‌లా కనిపించటంలేదా ..."

"అబ్బే అదికాదండీ ... మిమ్మల్నిచూసి ఏ బి ఏ. స్టూడెంటో అనుకున్నాను"

"యింకానయం ... ఏ మెట్రిక్యులేటో అనుకోలేదు"

నా నవ్వుతో శ్రుతి కలిపింది

"ఇంతకీ మీ పేరేమిటో చెప్పలేదు..." వుండబట్టలేక అడిగేశాను

"మాధురి..." అంది తియ్యగా.

"స్వీట్‌గావుంది .."

"ఏమిటి ..."

"మీ పేరు..."

*(గతసంచిక తరువాయి)*

"అంతే కదా. ." బుగ్గలు సొట్టపడేలా ఎంతో అందంగా నవ్వింది

"మీరు బి. ఎస్‌సి. చదవటానికి కారణం" ఏదొకటి మాట్లాడటం మంచిదనిపించింది.

"ఏముంది ... ఎమ్ బి బి ఎస్. కి సీట్ దొరక్కపోవటమే"

"మీకు సీట్ రాకపోవటం ఏమిటి . . తప్పకుండా వస్తుంది"

"ఓ రెండుసార్లు ఎంట్రెన్స్‌కి వెళ్లాను కాని సీట్ రాలేదు"

"ఈ సారికూడా ప్రయత్నించండి సీట్ తప్పకుండా వస్తుంది"

"సీట్ మాట దేముడెరుగు కాని మిమ్మల్ని చూస్తుంటే జాలి వేస్తుంది"

వున్నట్టుండి ఆమె అలా అనటంతో ఉలిక్కిపడ్డాను.

"ఎందుకని..." అన్నాను ఆమె ధైర్యానికి ఆశ్చర్యపోతూ

"యింత చదువూ చదివి మీరే వీధులు పట్టుకు తిరుగుతుంటే యింక మా గతి ఎలా వుంటుందో వూహించండి" అంది ఎత్తిపొడుపుగా

"బాగా చెప్పారు ... నిజానికి మీరు చదువులు పూర్తి చేసేసరికి కిళ్ళీ కొట్లకి బదులు వీధికి ఓ పది క్లినిక్‌లు వెలు స్తాయి" అన్నాను.

"అలా అయితే ఫర్వాలేదు .. అప్పుడు కిళ్ళీ కొట్లూ నడుపుకోవచ్చు ... క్లినిక్కూ నడుపుకోవచ్చు..." అంది

అప్పుడు తెలిసింది ఆ పిల్ల ఎంత పెద్ద మొండి ఘటమో.

పది నిముషాలయిపోయింది. ఇక ఏ నిముషంలోనైనా బస్‌గాడు వూడిపడే ప్రమాదం వుంది

అంతలో ఆ అమ్మాయే అడిగింది — "అన్నట్టు మీరేదో మాట్లాడా లన్నారు కదూ . . చెప్పండి" అని.

ఆ పిల్లకి దైర్యం ఎక్కువో ... వాగుడు ఎక్కువో తేల్చుకోలేక పోయాను వెంటనే.

"ఆ . బాగా గుర్తుచేశారు . చూడండి మీ కాలేజీలో చింటూ అనే అబ్బాయి ఒకడున్నాడు కదూ—" అన్నాను.

"అవును .. వున్నాడు..." చూపుల్లో అనుమానం తొణికిసలాడ్తోంది

"అబ్బే ఏమీ లేదు-ఈ మధ్య ఆ కుర్ర వాడు మీకేదో ప్రేమలేఖ వ్రాసాడని వినికిడి. " మాటలు తేల్చేశాను.

ఎవరో పరాయి ఆడపిల్లని అలా అడిగే అధికారం నా కెక్కడది అన్న ఆలోచన రాగానే కాస్త వుక్కిరి బిక్కిరి అయ్యాను.

షటప్ యిటీజ్ నన్ ఆఫ్ యువర్ బిజినెస్ అని ఆ అమ్మాయి అనివుంటే నా పరువంతా ఏమవునో ఆ క్షణం వూహించలేక పోయాను.

కాని అలా జరగలేదు

"ఆ విషయం మీకెలా తెలిసింది" కఠినంగా వుంది గొంతుక

"అందరూ అనుకుంటుంటే వింటమే .. " నాన్చేశాను.

"యింతకీ మీరు అడగదల్చుకుంది ఏమిటో సూటిగా అడుగుతారా"

ఈసారి కళ్ళల్లో ఎర్రజీర కనిపించింది.

ఇక లాభం లేదు వ్యవహారం ముదురు తుంది అనుకున్నాను.

"ఆ అబ్బాయికి మీ సమాధానం ఏమిటో తెల్సుకుందామని ..."

"ఏ...అతనికి మీరు ఏజెంటా..." చాలా పదునుగా వున్నాయి మాటలు.

"కాదు..."

"మరి..."

# ఇండియాలోనూ విదేశములలోనూ ఇప్పుడు అధికమైన ప్రమాణములో కావలసియున్నది ఈ కొబ్బరి పీచు



## తక్కువ మొదలిడుతో ఉన్న మైన పద్ధతిలో కొబ్బరిపీచును తయారుచేయు యంత్రములు ఇవిగో!

కొబ్బరిపీచును తయారించుటకు ఇండియాలో ఇంతవరకు సరియైన యంత్రములు లేకుండెను. అధిక ప్రమాణములో ఉత్పత్తిచేసి ఎగుమతి చేయుటకు వీలు లేకుండెను.

ఇప్పుడు దీనికి కావలసిన అన్ని యంత్రములనూ మేము తయారించి యున్నాము. వీని మూలముగా మీరు తక్కువ కాలములో ఎక్కువ ప్రమాణములో కొబ్బరి పీచును ఉత్పత్తి చేయవచ్చును. అధిక ప్రమాణములో ఎగుమతి చేయుటవలన అధిక రాబడిని ఎదురు చూడగలరు... మీకూ మీ దేశమునకూ!

ఇంతవరకు దక్షిణ ఇండియాలో 12 స్థలములలో మా 'ఎన్నార్' యంత్రములు సరియైన విధముగా పని చేయుచున్నవి.

తక్కిన వివరములకూ, సరియైన సలహాకూ మమ్మల్ని సంప్రదించండి.

(ఉత్తరాలను ఇంగ్లీషులో వ్రాయండి)

Manufacturers:
**BHARAT MOTORS**
5, Greames Road, Madras-600006
Phone. 86204 Cable: FIBRO-FLEX



Crusher



Defibering Machine






Revolving Screener



Fibre Baling Press

**Ennor**

యంత్రములు
కొబ్బరిపీచు
తయారించుటకు

"నిజానికి అతనెవరో నాకు తెలీదు ... మనిషిని చూడటం తప్పించి..."

"అయితే ఈ గొడవలన్నీ మీకెందుకు ." యింకా ఏదో అనాలనుకుంది కాని నా పెద్దరికానికి కాస్త గౌరవం యిస్తున్నట్లు అక్కడితో ఆగిపోయింది.

# సరికొత్త ప్రేమ కథ

"అడిగారు కాబట్టి, అసలు విషయం చెప్పేస్తున్నాను . కాస్త ఓపికగా - వినండి" అన్నాను చిన్నబుచ్చుకుంటూ

"త్వరగా చెప్పండి బస్ వచ్చే టైమ్ అయ్యింది" అంది చిరాకుపడూ.

"చూడండి ఆ లైబ్రరీ దగ్గర నిలబడ్డ వ్యక్తి నా స్నేహితుడు. అసలు పేరు చక్రవర్తి ...అప్పుడప్పుడూ కథలు వ్రాస్తుంటాడు"

"ఎవరూ...ఆయనే" ఆశ్చర్యంగా చూసి, ఎందుకో చిన్నగా నవ్వింది.

"అవును ఆయనే...ఈమధ్య మీ చింటూ కథ వినటం జరిగింది .. దాన్ని ఆధారంగా చేసుకుని ఒక కథ వ్రాయటం మొదలు పెట్టాడు. కాని ఏంలాభం సగంలోనే ఆగిపోయింది" అన్నాను.

"ఏ ఎందుకని ... " ముఖం అదోకలా పెట్టింది.

"ఆ చింటూ వ్రాసిన వుత్తరానికి మీరు జవాబేమీ యివ్వలేదుగా...అందుకని"

"అయితే మీకు యింకోపని లేదన్నమాట ...యిలా రోడ్డునపోయే ఆడపిల్లలందరితో మాట్లాడటం, వాళ్లు చెప్పిందంతా విని కథలు వ్రాసేయటం యిదేనన్నమాట మీరు చేసే ఘనకార్యం..." ఆవేశపడింది.

"పొరపడుతున్నారు—చక్రవర్తి మీగురించి కథ వ్రాయటంలేదు ... కేవలం ఈ సంఘటన్ని ఆధారంగా తీసుకుని వ్రాస్తున్నాడు..." సర్ది చెప్పటానికి ప్రయత్నించాను

"అయితే నా పర్సనల్ మేటర్స్ లో యిన్వాల్వ్ అవటందేనికి..."

ఆ తెగింపుకి ఆశ్చర్యపడ్డాను. ఇంకో ఆడపిల్ల అయితే అంత బహిరంగంగా, బస్ స్టాప్‌లో ముక్కూ మొఖం తెలియని అగంతకుడితో అంతసేపు మాట్లాడటమే ?

బాప్రే ఆంధ్రదేశం చాలా అడ్వాన్స్ అయ్యిందిగుతూ ఆడపిల్లల విషయంలో. అన్నాడు ఆత్మగాడు.

"ఏమీలేదు కథ కాస్త నేచురల్ గా వుంటుందని..."

మాధురి కళ్లు దించుకొని క్షణకాలం ఏదో ఆలోచిస్తూ వుండిపోయింది.

"మీ వ్యక్తిగత విషయాల్లో కలగజేసుకున్నందుకు ఏమీ అనుకోకండి ... మీకు యిష్టంలేకపోతే చెప్పొద్దు" అన్నాను.

"నోనో అలాంటిదేమీలేదు ... అందరూ చూస్తుండగానే అతను ఆ లెటర్ యిచ్చాడు. నేనూ అంతే ఓపెన్‌గానే యిందను అడిగి తీసుకున్నాను ... అందుకే ఈ విషయాలు మీ వరకూ వచ్చాయి ... యికపోతే నాకు కథలు వ్రాయటం అంటే ——— అసలు యిదంతా నేనే ఒక కథగా వ్రాద్దా


ప్రొద్దున్న ఉండే తాజాదనం, సౌరభం రోజంతా ఉంటుంది!
చన్నీళ్ల స్నానమిచ్చే తాజాదనము గంటల కొలదీ-పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ ఆ అనుభవమును రోజంతా యిస్తుంది. దానిని మీ ఒళ్లంతా జల్లుకోండి. మీరు తాజాగా, శుభ్రముగా మరియు చల్లగా ఉంటారు. దాని, తేలికైన సువాసన మిమ్మల్ని పట్టి ఉంచే, అది చెమ్మను పీల్చి మిమ్మల్ని పొడిగా, సౌఖ్యముగా ఉంచుతుంది, ముఖ్యంగా మండు ఎండా కాలములో. చెమట వాసన, చర్మము నిగపట్టుట ఉండవు. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ ఎంత మెత్తగా ఉంటుందంటే దానిని మీ ముఖము మీద కూడ రాసుకోవచ్చును.
పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్
Pond's Dreamflower talc
Dreamflower talc
మిడియం, ఫ్యామిలీ మరియు ఇప్పుడు కొత్తగా 196 గ్రా బాక్స్ సైజ్‌లో లభిస్తున్నాయి.
చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

మనుకున్నాను ... యింతలో మీ స్నేహితుడే మొదలుపెట్టి నాక్కాశమ తగ్గించాడు .. ఆయనకి నా థాంక్స్ అని చెప్పండి". . చిన్న నవ్వు "యిప్పుడు మీకేం కావాలో అడగండి" అంది హుషారుగా

తెల బోయాను. ఏమిటీపిల్ల రోజూరమ ణిలా అన్నివేషాలు వేసేస్తోంది కొంపతీసి ఓ చిన్నతరహా నటీమణి కాదుకదా ?

"మీరు అతడికి ఏం రిప్లయ్ యిస్తున్నారో చెప్తేచాలు . ." ఆ గొడవ అక్కడితో వదిలిపోతే చాలనిపించింది

"వుండండి" అంటూ పుస్తకంలోంచి ఓ కాగితంతీసి అందించింది.

"ఏమిటది ?"

"చదవండి .. చింటూకి నేనిచ్చిన రిప్లయ్ ." అంది నవ్వేస్తూ

బస్‌స్టాప్‌లో యిద్దరు ముగురు చేరారు అప్పటికి మరో అయిదు నిముషాలయ్యింది కాని బస్ యింకా రాలేదు దేముడు దయ తలచి బస్సుగాడిని ఎక్కడో పేసి వుంటాడు. లేదా ఆ బస్‌గాడికీ ఈ బస్‌గాడికి కయ్యం పెట్టివుంటాడు అనుకున్నాను.

ఆ వుత్తరం యింగ్లీషులోవుంది. టూకీగా తెలుగులో దాని సారాంశం యిది—

ప్రియమైన స్నేహితుడా,

నీ వుత్తరం చూశాను కృతజ్ఞతలు. నీప్రేమని నేను కాదనాలేను కాని అది నీవను




# సరికొత్త ప్రేమకథ

కున్నట్టు కాకుండా యింకో విధంగా స్వీకరి స్తున్నాను ఈ మూడింటిలో ఏదొకటి నువ్వే ఎన్నుకుని అది ఖాయంచేసి నాకు తెలియజేయి — అక్కగానో — చెల్లెలిగానో — స్నేహితురాలిగానో - ఎందుకని అడుగుతా వేమో. నువ్వూ నేనూ ప్రక్క ప్రక్కన నిలబడితే అందరూ ఏమనుకుంటారో తెలుసా అన్నాచెల్లెళ్ళనో... అక్కాతమ్ముళ్ళనో అను కుంటారు మనయిద్దరి ముఖాలికీ అంత దగ్గరి పోలికలున్నాయి అందుచేత పిచ్చి పిచ్చిగా వూహించి మనసుపాడుచేసుకోక ఎప్ప టిలా స్నేహంగావుంటూ సర్దాగా మాటాడు ఈ విషయాన్ని నువ్వు అందరికీ చెప్పినాసరే చెప్పకపోయినాసరే ఫర్వాలేదు . కేవలం నా సమాధానం రహస్యంగా అందజేయాలని వుత్తరాన్ని నీ చిరునామాకు పోస్టుచేస్తున్నాను ఆ తరువాత నీ యిష్టం. ఎలాచేసుకున్నాసరే. వుంటాను స్నేహితురాలు.

మాధురి.

అనివుంది

"వండర్‌ఫుల్... అద్భుతంగా వ్రాశారు" అన్నాను నెమ్మదిగా.

"అందులో వండర్ ఏమీలేదు .. చాలా మామూలుగా వ్రాశాను "

"లేదులేదు యిందులో లిటరరీ ఎక్స్ ప్రెషన్‌వుంది... నాకు నచ్చింది" అన్నాను మెచ్చుకుంటూ

"థాంక్సు... అయితే ఈ వుత్తరంతో మీస్నేహితుడు వ్రాస్తున్న కథ పూర్తవు తుందా" అని అని అడిగింది

"చాలావిక్కట్టైన ప్రశ్నే అడిగారు..."

"ఎందుకని ."

"ఇప్పటివరకూ కథ బాగానే నడిచింది అనుకోండి...కాని మీ వుత్తరం చూశాక ముగింపు ఏంచెయ్యాలో అర్థంకావటంలేదు... పాపం భగ్నప్రేమికుడు ఆ చింటూ ఏం అఘాయిత్యం చేస్తాడో ఏమిటో" అనాలోచి తంగా అనేశాను.

చిన్నగా నవ్వి... "పోనీ నేనొకలా చెప్తాను అలా చెయ్యకూడదూ" అంది ఏదీపట్టించు కోనట్టు.

"నేను చెయ్యటానికేముంది... మా చక్రవర్తికి చెప్తాను... ఏమిటోచెప్పండి" అన్నాను.

"మీ హీరోయిన్ యింకెవరినో ప్రేమించి నట్లు వ్రాయమనండి" అంది సిగ్గుపడ్తూ.

"బాగుందండీ మీరు చెప్పేది . ఆకొత్త హీరోగారు ఏరాత్మగా ఆకాశంనుండి వూడి పడాలిప్పుడు" అన్నాను పరిహాసంగా.

"మీరేమి అనుకోనంటే ఒకటి చెప్తాను.. " ఆమె ఎందుకంత గంభీరంగా మాట్లాడుతుందో అర్థంకాలేదు.

"తొందరగా చెప్పండి. . అవతల బస్ వచ్చేస్తోంది" అన్నాను దూరంగా కనిపించిన బస్సుగాడిని చూస్తుంటే వళ్ళు మండి పోయింది.

"కొత్త హీరోగారు ఆకాశంలోంచివూడి పడక్కర్లేదు ఎదురుగావున్నాడు అనిచెప్పండి" అంది మొహమాటపడ్తూ— "మీరచయిత గార్నే హీరోచేస్తే పోలేదూ..." ఆమె చెప్తూనేవుంది.

"ఏమిటి మీరంటుంది" బస్సుమలుపు తిరుగుతోంది.

"నిజానికి మీ హీరొయిన్ అతన్నే ఆరాధి స్తోంది. యిప్పుడు వాళ్ళిద్దరినీ ఒకటి చేయ టం తప్ప విడివి మరోమార్గంలేదని చెప్పండి చక్రవర్తిగారితో ." అంది

"అంటే ..అంటే...మీరనేదే నాకు అర్థం కాలేదు "

"చూడండి బస్ వచ్చేసింది నేను వెళ్తాను మరి.. మిగతా కథ రేప్రొద్దుట చెప్తుకుం దాం పదింటికల్లా వచ్చేస్తారు కదూ రేపు నేను కాలేజీకి వెళ్లను మీ కోసం వెయిట్ చేస్తుంటాను యిక్కడే . ఈ బస్‌స్టాప్‌లోనే" వెళ్లి బస్సెక్కింది మాధురి

అచేతనంగా అక్కడే నిలబడిపోయాను.

బస్ వెళ్లిపోటం, చక్రవర్తి దగ్గరకు రావటం—ఏమిటిగురూ ఏమయ్యింది అంటూ భుజంపట్టి వూపటం- అప్పుడే నా అనేవాడికి తెలివి రావటం జరిగింది

* * *

ఆ రాత్రంతా మెదడు మొద్దుబారినట్టు తయారయ్యింది ఏమి ఆలోచిద్దామన్నా అంతా పిచ్చిగానే వుంది. ఆత్మగాడు వూరుకో లేదు నిలదీసాడు అసలు ఆ పిల్లతో ఎందుకు మాట్లాడినట్టు ప్రేమిస్తున్నావా ఆరాధిస్తున్నావా . వాంఛిస్తున్నావా ... సంబరం చేద్దామనుకుంటున్నావా ... ఛత్ .. నీ వుద్దేశ్యం ఏమిటిరా, అయినా నాకు తెలీక అడుగుతాను. ఆ పిల్లమీద నీ కన్ను ఎలా

AYURVEDIC

TRADE MARK

# జీవన్ టోన్

Regd No. 218726

రోగనిరోధక శక్తి, శారీరక బలము, అందమైన ఆకారము, స్వచ్ఛమైన రక్తము గలవారే విశేష ఆరోగ్యవంతులుగా ఎంచబడుచున్నారు

ఆయుర్వేదౌషధముల ప్రభావమును నమ్మనివారు ఇప్పటికీ కొందరున్నారు. అట్టివారికి సవాలుగా మేము జీవన్‌టోన్'ను తయారు చేసియున్నాము. ఈ మందు మార్కెట్టులో సర్వోత్తమమైన స్థానమును గల్గియుండుటచే అనేక వేలమంది యింకనూ దీనిని ఉపయోగించుచు గొప్ప ఫలము, తృప్తిని పొందుచున్నారు.

బలవర్ధకౌషధము మహిమోపేతమైన గుణము గలదగుటచే ప్రచారము చేయవలసిరేదు

ఈ బలవర్ధిని అన్ని వయసుల వారికి సరిపడును దీనిని ఒకసారి వాడినచో దీనిగుణము తెలియగలదు. మామూలు బరువు, శరీరసౌష్టవము గల్గిన తరువాత ఈ మందును ఉపయోగించ నవసరము లేదు (కాలపరిమితి—నాలుగు లేక ఐదుసారుల వరకు ఉపయోగించవలెను) దీనిని సేవించు సమయమున ఎండలో తిరుగుట మానవలెను. మంచి నిద్ర ముఖ్యావసరము.

'జీవన్‌టోన్' హటాత్తుగా శరీరమునకుబరువును, సౌష్టవమును చేకూర్చుటచే ఇది జంతువుల క్రొవ్వు పదార్థము గల్గియున్నదని కొందరు అనుమానించుచున్నారు అట్టివారికి ఇందులో కాయకూరల క్రొవ్వును, సులభముగా దొరకని వనమూలికలును మాత్రమే చేరియున్నవని మనవి చేయుచున్నాము.

'జీవన్‌టోన్' రోజురోజు అతి త్వరితగతిని పురోగమించుచున్నది అస్థిపంజరములుగానున్న వేలకొలది ప్రజలకు మాంసకండలను చేకూర్చుచున్నది.

ఈ బలవర్ధ కౌషధముయొక్క గుణములు:— ఆరోగ్యమును, శక్తిని తిరిగి చేకూర్చును. బరువు తగ్గుదలను, అలసటను వీర్యక్షీణమును పోరాడి నిరోధించును మరియు మితి మీరిన సంభోగ కార్యము వలన సాధారణముగా గల్గు పరిణామములకు 'జీవన్‌టోన్' ఒక మహత్తరమైన టానిక్. దీనిని ఉపయోగించిన కొద్ది రోజులకే దీని మంచి గుణములు తెలియును కావలసిన బరువు, ఆకార సౌష్టవము పొందిన తరువాత దీనిని ఉపయోగించుట నిలుపవచ్చును స్థూలశరీరులగు స్త్రీ పురుషులు మాత్రము దీనిని ఉపయోగించరాదు ఏలనన అదివరకే స్థూలమైన శరీరములకు మరింత కండ, మాంసము పెరిగినయెడల నిత్య వ్యవహార జీవితమునకే చాల అడ్డంకులు యేర్పడును స్త్రీలు ప్రసవించిన తరువాత దీనిని వాడవచ్చును ఏ ఋతువునందైనను, ఏ కాలమందైనను నిర్ణీతమైన ఆహార నియమము లేకుండగనే ఈ మందును వాడవచ్చును

వాడు విధము — ఈ టానిక్కు ప్రతిరోజు ఆహారమునకు ముందు మూడు మారులు పాలు, పెరుగు, వెన్న వాడకపోయిననూ మంచి గుణము నిచ్చును. వీటిని కూడా వాడినచో గుణము రెండింతలు ఎక్కువగును ఏ జబ్బును లేనివారు దీనిని ఉపయోగించినచో రక్తము మరింత వృద్ధియగును

**తప్పనిసరిగా పెద్దలకుమాత్రమే:-**

**సెల్ఫో ఆయిల్: వెల రూ. 10-00**

**సెల్ఫో పౌడర్ : వెల రూ. 10-00**

వివరముల పట్టిక పంపగోరువారు పోస్టేజి బిళ్ళలు పంపండి.

వి పి పి లో పంపగోరువారు క్రింది చిరునామాకు వ్రాయండి :

**JEEVANTONE PRODUCTS,**

**51, G. Street, Bangalore-8**

మాయొక్క స్టాకిస్టుదారులు — (1) జనతా మెడికల్ స్టోర్సు, శివాజీ నగర్ బస్సుస్టాండు ఎదుట, బెంగుళూరు, (2) సిటీ మెడికల్స్, చిక్‌పేట, బెంగుళూరు (3) 51— జి స్ట్రీట్, అల్సూరు, బెంగుళూరు —8, (4) జయంతి జనరల్ స్టోర్స్, ధాదర్ స్టేషన్ ఎదుట, బొంబాయి—28, (5) కుంవార్ మెడికల్‌హాలు, జకరియా మజీద్ స్ట్రీట్, బొంబాయి—9 (6) శారదా ఎంటర్‌ప్రైజెస్, 1—727 బెంపుర్‌రోడ్, మంగుళూరు—6 (7) కె యస్ రత్నం అండ్ సన్స్, నెల్లూరు (8) సూరయ్య మెడికల్ స్టోర్సు, 1— సెర్కుల్‌రోడ్డు విజయవాడ—1 (9) లక్ష్మీనారాయణ అండ్ కో, కాకినాడ —1 (10) పి ఎ మోహన్‌కుమార్, ప్రసాద్ బిల్డింగ్, సాదర్ బజార్, అహమ్మదాబాద్ (11) ఆయుర్వేదమ్ మెడికల్ హవుస్, కోటి బస్ స్టాండు, హైదరాబాదు—1, (12) శ్రీ ధనలక్ష్మి మెడికల్ స్టోర్సు, విజయనగరం—3, (13) రాజేంద్ర మెడికల్ స్టోర్సు, గాంధి చౌక్, జమిగుంట, (14) శారదా స్టోర్సు, 3106 రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు, (15) గుప్త మెడికల్ స్టోర్సు, లాలాపేట పోలీస్ స్టేషన్, గుంటూరు—3, (16) వసంత మెడికల్ స్టోర్సు, 4—4—293 కోటి, బ్యాంక్ రోడ్, హైదరాబాదు, (17) ఆయుర్వేదిక్ మెడికల్ స్టోర్సు, మెయిన్ రోడ్డు, అనకాపల్లి, (18) ఎం ఎ జనరల్ ఏజెన్సీస్, 8 7 రెండ్ స్ట్రీట్, కోయంబత్తూరు—10, (19) మహాలక్ష్మి స్టోర్సు, సాగర్, షిమోగా (20) 18—పూనమల్లి హైరోడ్, (కమల కాసే వర్క్సు) మద్రాసు—3

పడిందిరాబాబూ . ముక్కుపచ్చలారని పిల్ల... నీ కథల పొలిటెక్స్‌తో బెదరగొట్టేయటం ఏమన్నా భావ్యంగా వుందా ... కొంపతీసి చక్రవర్తిని లవ్ చేసిందనుకో ... అప్పుడేం చేస్తావ్ ... కాదంటావా ... నువ్వు వట్టి పూల్‌విరా ... యినేమీ ఆలోచించకుండా ... బస్సు స్టాప్ అని చూడకుండా పెళ్లి పలకరించావు...ఏమయ్యింది కథ అడ్డం తిరిగింది. యిప్పుడు తెలిసింది కదా ఆ పిల్ల ఆంతర్యం ఏమిటో ... ఆవిడగారు చక్రవర్తిగాడ్ని ప్రేమిస్తోందట ... ఆరాధిస్తోందట. వాడ్ని హీరో చేస్తే పోలేదూ అంది. అంతకంటే వేరే అవమానం ఏముందిరా నీకు...నా మాట విని ఈ పాడు ఆలోచనలు మానుకో ... ఆ పిల్లని మర్చిపో—' అన్నాడు.

'సారీ బ్రదర్ కథ అడ్డం తిరిగింది ... ఇలా జరుగుతుందనుకుంటే ఆ పిల్లతో నేనసలు మాట్లాడకపోదును—సణుక్కుంటూ నిద్రలోకి జారుకున్నాను

మర్నాటికి మాధురిని మర్చిపోయాననే చెప్పాలి ఆ పిల్ల స్వభావం కాస్త కూస్త తెలిసిపోయింది కాబట్టి ఆ విషయాన్ని తేలికగా తీసుకోవచ్చనిపించింది. మామూలు నిరుద్యోగి రూపంలో పదిగంటల ప్రాంతంలో బుక్ సెంటర్ చేరుకున్నాను

వెళ్ళగానే — "మీకోసం బాబీ వచ్చింది" అన్నాడు జిలానీ.

అదిరిపడ్డాను.

"మీరు ఎవరిగురించి మాట్లాడుతున్నారు" కాస్త సీరియస్‌గా అని వుంటాను.

జిలానీ నవ్వు ఆపేశాడు "అదేనండి ... బాబీ అంటారు చూడండి...ఆ అమ్మాయే" అన్నాడు

"ఎందుకట ."

"ఎందుకో తెలీదుకాని ... పదినిముషాల్లో వస్తే టెన్ నెంబరు బస్‌స్టాప్‌కి రమ్మని చెప్పమంది ఆ అమ్మాయి"

జిలానీతో ఏమీ మాట్లాడాలనిపించలేదు. కథ లేనిపోని మలుపులు తిరుగుతోన్నట్లనిపించింది.

వెళ్లాలా వద్దా అని క్షణకాలం సందేహించాను

మెదడుగాడు మౌనం వహించటంతో కాళ్ళు స్వేచ్ఛా జీవులయ్యాయి

బస్సు స్టాప్‌లో మాధురి వుంది. మరో పదిమంది వున్నారు. అందులో కొన్ని తెల్సున్న ముఖాలుకూడా వున్నాయి. మళ్ళీ ఓ ఆలోచన. పలకరించాలా వద్దా అని. నేనొక నిర్ణయానికి వచ్చేలోపలే మాధురి నన్ను చూసేసింది. చిన్నగా నవ్వింది

తప్పలేదు బస్స్టాప్ దగ్గరకి వెళ్ళాను.

"మీకోసం పావుగంటనుంచి వెయిట్ చేస్తున్నాను" అంది ఇంగ్లీషులో

"అయామ్ సారీ ... కాస్త లేటయ్యింది" అన్నాను సభ్యత కోసం.

"మీకేమీ అభ్యంతరం లేకపోతే ఆ హోటల్‌కివెళ్ళి మాట్లాడుకుందాం" అంది

మళ్ళీ సందిగ్ధావస్థలో పడ్డాను.

నేను ఎంతకీ జవాబివ్వక పోవటంతో — "రండి ..." అంది దారితీస్తూ

అనుసరించటం నా వంతయ్యింది.

నాయర్ ఫామిలీరూమ్ చూపించాడు. మాధురి లోపలికి వెళ్ళింది. ఆమెకు ఎదురుగా కూర్చున్నాను

"ఇప్పుడు చెప్పండి.. కథ నేను చెప్పినట్లే పూర్తిచేశారా" అంది చిరునవ్వుతో.

"ఏమోనండి చక్రవర్తి ఏం చేశాడో మరి ... మీరు చెప్పిందంతా చెప్పాను" అన్నాను యిబ్బందిగా

కిల కిలా నవ్వింది మాధురి. అందులో హేళనవుంది.

'ఎందుకు నవ్వుతున్నారు" అన్నాను అనాలోచితంగా

"మీ చక్రవర్తి కథలు వ్రాయటం ఏమిటా అని ..."

"భలేవారే ... చక్రవర్తి ఎంత మంచి కథలు వ్రాస్తాడో మీకేం తెల్సు..."

"ఇక ఈ అబద్ధాలు కట్టిపెడ్తే సంతోషిస్తాం ..." అంది

"నిజంగా...నామాట నమ్మండి" అన్నాను ముభావంగా

"నా దగ్గిర దాస్తారెందుకు చెప్పండి. నాకంతా తెలుసు .. ఆ చక్రవర్తిని అడ్డం పెట్టుకుని మీరు ఈ నాటకం ఆడుతున్నారు .. యిప్పటివరకూ జరిగిన కథకి కారకులు మీరు... వ్రాస్తున్నదికూడా మీరే" ఆ మాటల్లో కోపం లేదు కాని ఒక రకమైన అధికారం వుంది.

"నేనా ... రామ ... రామ ... నేను కథలు వ్రాయటం ఏమిటండీ ..." కాస్త గట్టిగా నవ్వేశాను.

"చూడండీ మీరు కథలే కాదు నవలలు కూడా వ్రాస్తారనీ ... మీ పెన్ నేమ్ రాధ అనీ నాకెప్పుడో తెలుసు ..జిలానీ చెప్పాడు... అంతే కాదు ఆ చక్రవర్తి మీ ఆప్త మిత్రుడనీ నా కోసం అతన్ని అడ్డం పెట్టుకుని ఈ అబద్ధం ఆడారనీ ... నేను అతడ్ని ప్రేమిస్తున్నాననగానే మీ మనస్సు మనసులో లేదనీ..." యింకా చెప్తూనే వుంది

"అయితే మీకు అసలు కథంతా తెలుసన్నమాట..." అన్నాను గంభీరంగా.

ఈసారి కథ అడ్డం తిరగటం మానేసి అష్ట వంకరలు తిరిగిపోయిం దనిపించింది.

"అంతేకాదు మీరన్నా మీ కథలన్నా నాకు చాలా యిష్టం..." చాలా నెమ్మదిగా అంది



# నా శ్వాసలో శ్వాసించే నా ప్రియుడు

## నన్ను విడిచి క్షణం

నిర్మలమై, తాజా రుచి గలిన బినాకా గ్రీన్ నాకెంతో అవసరమైన ఆత్మ విశ్వాసాన్ని చేకూర్చుతుంది ముఖ్యంగా నేనతని చేరువనున్న మధుర క్షణాలలో. ఎందువల్లనంటే, బినాకా గ్రీన్‌లో శ్వాసయొక్క దుర్వాసనను హరించి మీ నోటికి రోజంతా హాయి గొల్పే తాజా తనాన్నివ్వగల ప్రకృతిసిద్ధమైన దురంధ-సంహారక పదార్థము, క్లోరోఫిల్ ఉన్నది అందు చేత బినాకా గ్రీన్ నా కత్యంత ప్రియతమమైంది

నన్నింతగా ప్రేమించే నా ప్రియుణ్ణి కేవలం నా వాడిని చేసిన బినాకా గ్రీన్‌కు ధన్యవాదాలు

## స్వర్గంలో కూడా ఉండలేనంటాడు




## మా గాఢ అన్యోన్య ప్రేమకు కారణం- బినాకా గ్రీన్




బినాకా టూత్ బ్రష్‌కి గుండ్రటి కొనలు ఉంటాయి ఇగుళ్ళను ఏమాత్రం గాయపరచవు.

CIBA-GEIGY

Rediffusion/CG/194 e Tel

# సరికొత్త ప్రేమ కథ

నేను మాట్లాడలేదు. థాంక్స్ చెప్పాలన్న వూహే రాలేదు.

''నిన్న మీకు ఒకటి చెప్పాను గుర్తుందా''

''ఏమిటది'' వులిక్కిపడి తలెత్తి చూశాను.

''అదే మీ కథకి ముగింపు ఎలా వుండాలో ...'' అంది మొహమాటపడ్తూ

''ఊ. '' అన్నాను ముభావంగా.

''ఇప్పుడుమనకథ అలాగే ముగించండి...'' అంది కళ్ళలోకి ఆప్యాయంగా చూస్తూ

''అంటె ..'' కాస్త కంగారుపడ్డాను.

''అబ్బ! యింతకంటే నేనేమీ చెప్పలేను బాబు'' అంది బుంగమూతి పెడ్తూ

వున్నపళంగా అక్కడనుంచి లేచి పారిపోవాలనిపించింది.

''ప్లీజ్ ఆ సంగతి మర్చిపోండి...యింకేమైనా మాట్లాడండి'' అన్నాను.

చురుకుగా చూసింది. ఆ చూపులో ఏదో లోపం వుంది. అది కోపమో అనుమానమో అర్థంకాలేదు.

''కథ యింతవరకూ నడిపించి యిప్పుడు మర్చిపోమంటున్నారా...ఏం మగారండీ మీరు. మీకు యిదేమైనా న్యాయంగా వుందా'' అంది చనువుగా.

ఎదురుపెట్టి చదరంగం ఆడటమంటే యిదే అనిపించింది

''మీరేమంటే అనుకోండి కాని నా నిర్ణయం మారదు'' అంది ధీమాగా.

''ఏమిటండది '' అంతకంతకూ నా మాటల్లో నీరసం ఎక్కువైపోతోంది

''ఈరోజే మా నాన్నగారితో మాట్లాడేస్తాను. '' అంది

''ఈ కథ గురించి మీ నాన్నగారితో మాట్లాడటం దేనికండీ .'' నాకు నవ్వాలనిపించింది. కాని మాధురి నవ్వలేదు

''కథ గురించికాదు ,మన పెళ్ళిగురించి'' అంది గంభీరంగా

నా నోట్లో వెలక్కాయ పడింది

''మీకు ప్రేమకథలు వ్రాయటం ఒక్కటే తెలుసు ... ప్రేమించటం రాదని ఈరోజే తెల్సింది'' అంది యింగ్లీష్‌లో నిష్ఠూరంగా

''వెయిట్ ఏ మినిట్ ... నా కథలంటే యిష్టమన్నారు బాగానే వుంది కాని చక్రవర్తి నాకంటే బాగుంటాడు మరి '' అన్నాను చొరవతీసుకుంటూ.

''చక్రవర్తి...చక్రవర్తి ... చక్రవర్తి ... ఆ పిల్లాడి వూసెత్తకుండా వుండలేరా'' మరీ చిన్నపిల్ల అయిపోయింది మాదురి. ''ఇంకోసారి అతడి పేరెత్తారంటే వూరుకునేదిలేదు ఆ...బుంగమూతి వాడూనూ...'' అంది రుసరుసలాడ్తూ.

నేను నవ్వేశాను.

''ఎందుకు నవ్వుతున్నారు'' అంది విసురుగా.

''అహా! నాముందే నా స్నేహితుడ్ని వెక్కిరిస్తుంటేను.''

''నేనేమీ వెక్కిరించటంలేదు ... అతడలా వుండడా ఏమిటి ..'' కోపం తగ్గలేదు

''పోనీ మీ కంటికి నేనెలా వుంటానో చెప్పండి...''

''ఏమో నాకు తెలీదు...''

''అంత తెలీకుండానే ఆరాధిస్తున్నారా...''

క్షణకాలం మౌనం వహించింది.

''ఈ జన్మలో పెళ్ళంటూ చేసుకుంటే మిమ్మల్నే చేసుకోవాలని నిర్ణయించుకున్నాను'' అంది.

''ఒకవేళ నేను వప్పుకోకపోతే...''

''ఆ పని మీవల్ల కాదని నాకు తెలుసు ''

మళ్ళీ అదేచూపు–ఎదుటి మగాడ్ని చిత్తుచేసేచూపు అదేనవ్వు–ఎలాంటి మనసునైనా కట్టిపారేసే నవ్వు.

''అంతా బాగానే వుంది మరి ఆ చింటూ సంగతి ఏమిటి'' అన్నాను

''అబ్బ! మళ్ళీ అదేగొడవా మీకు పుణ్యం వుంటుందికాని ఆ విషయం మర్చిపోండి ప్లీజ్'' అంది

''అదికాదు మీరు నన్ను ప్రేమిస్తున్నట్లూ పెళ్ళి చేసుకోబోతున్నట్లూ ఆ చింటూకి తెలిసిందనుకోండి నామీద పగబట్టి స్నేహితుల్ని తీసుకుని తన్నటానికి వచ్చాడనుకోండి నిజంగానే నా బుర్ర బద్దలు కొట్టాడనుకోండి అప్పుడేంచేస్తారు ''

''అలా జరగటానికి వీల్లేదు. .''

''అహా! ఒకవేళ అలాజరిగిందనుకోండి...''

''మీతోపాటే నేనూ చస్తాను సరేనా ..'' అంది చాలా కోపంగా

వరేయ్ మాధురి మామూలురకం మనిషి కాదురా ,,వట్టి మొండిఘటంఅని మనసులోనే అనుకుని నన్నునేను అభినందించుకున్నాను.

''ఇంకోవిషయం . నేను నిరుద్యోగిని ఒకరికి పెట్టలేను . . ఒకరిమీద ఆధారపడలేను అంచేత మీరు ''

మధ్యలోనే అందుకుంది.

"మీకు అక్కర్లేనిది ఏదీనాకు వద్దు... మీరు తినగా మిగిలితే తింటాను లేకపోతే లేదు. ఇక నా అనుమానాలన్నీ తీ రి పోయేనా" అంది.

"మాధురీ" అంటూ ఆప్యాయంగా ఆమె చేతిని చేతిలోకి తీసుకున్నాను.

ధైర్యంగా నవ్వుతూ నాకళ్ళల్లోకి చూసింది

"నన్నెందుకింత అదృష్టవంతుడ్ని చేస్తున్నావో నాకు అర్థంకావటంలేదు" అన్నాను.

"భలేవారే... నేను చేయటం ఏముంది... మీరే నా కథంతా వ్రాసుకున్నారు...పోతే ముగింపు ఎలావుండాలో, చెప్పానంతే" అని ... నేతిని సుస్మితంగా ముద్దుపెట్టుకుంది. ఎవ ముందుకథంతా అందరికీ తెలిసిందే!!!

## ఉత్తరాలు

(2వ పేజీ తరువాయి)

(2వ పేజీ తరువాయి)

సీరియల్

"కాన్పరెన్సులు అనబడే తిరునాళ్ల కథలు" ఆంధ్ర సచిత్ర వారపత్రికకు ఒక హైలైట్, కవశ శర్మ గారికి చాల కృతజ్ఞతలు, 'ఈనాటి యువ శాస్త్రవేత్తలకు వారి గురువరులు చేస్తున్న అన్యాయాలను రచంత్మ హాస్యంతో శమిడిన సీరి














యల్‌తో చక్కగా ప్రతిబింబించారు. ఇలాంటి అన్యాయాలు సమసిపోయినప్పుడు మాత్రమే భారతదేశంలో శాస్త్ర, సాంకేతికరంగాలు అభివృద్ధి చెంది ఉన్నత ప్రమాణాలను రూపొందించ కలిగేది.

కె. ఎం. రావు, (కుంటముక్కల)

ము ఖ చి త్ర ం

25.4.75 నాటి పత్రికకుకుమారి "మంజుల" ముఖచిత్రం, ఎంతో వర్ణనాతీతము. ప్రకృతి సౌందర్యము, పచ్చని కాంతులను వెదజల్లుతున్న వృక్షములు, గలగలలాడేపారే సెలయేరు, యేటి ఒడ్డున తడిసిన ఒళ్లతో, తన కొంగును పట్టుకుని కూర్చుంటే, ఆ సౌందర్యం రమణీయంగా, అత్యంత ఆకర్షణీయంగా — మ ల్లె ల కుసుమములను వెదజల్లుతూ, మమ్మల్ని ఆనంద డోలికలో ముంచి వేసింది. ఇక ముందు కూడా మంచి ముఖచిత్రాలను ప్రచురితంజేసి, నాలాంటి శ్రోతలకు, తీరని లోటును, తీరుస్తూ శ్రోతల నెక్కువ సంఖ్యలో ఆకర్షించ మనవి.

మహమ్మద్ జహీరు అహమదు, ఎం. జెడ్ ఎ. ఫాతిమా. (వనపర్తి)

ఉగాది ముఖచిత్రం

18—4—75 నాటి ఉగాది సంచిక చూసిన పిదప సినిమా ముఖాలకు అలవాటుపడ్డ మాకు ఉగాది పూహాలు సహజ వర్ణ చిత్రములుకొంచెము ఎన్నెట్టుగా కనిపించింది. చిత్ర లేఖనము సహజముగాయున్నది. అచిరకాలంలోనే గోలి శంక

# సామాన్యుని సణుగుడు

అన్నం వున్నా లేకపోయినా ఫర్వాలేదు కాని సినిమా లేకపోతే యింకేమన్నా వుందీ యీ ప్రజాస్వామ్యంలో పిచ్చెత్తిపోదూ ... అందుకనే సినిమా వాళ్లక్కూడా ప్రేక్షకుడంటే మహచులకన. సామాన్యుడైన ప్రేక్షకుడు ఆఫ్టరాల్ రెండుంపావలా టిక్కెట్ కొనుక్కొని ముప్ఫయిలక్షల సినిమాహాల్లో కూర్చొని, జ్యోతిలక్ష్మి రంగుల బైస్కోపు చూసేసివాడు కూడా 'డాబు' చేయటమే. క్యూలో నిలబడాలి ... పోలీసువాడిచేత తిట్లు లాఠీపోట్లు తినాలి...చొక్కా చింపుకోవాలి... తెలుగు సినిమా హీరో హీరోయిన్ లెంత 'క్లోజుగా వాటేసుకుంటారో' అంత క్లోజుగా సోదర ప్రేక్షకులను వాటేసుకుని క్యూలో నుంచి బయటికి తుప్పున త్రుళ్లిపడి పోకుండా కాపాడుకోవాలి ... అనక బుకింగ్ కంతలో చెయిదూర్చి, చిల్లరా, టిక్కెట్టూ మన చెయ్యీ మూడు కలిపి అమిత లాఘవంగా బైటకు తీసుకోవాలి...లేదూ... మన చేతికి ఒకటే పిండికట్టు - లేదా "బర్నాల్" లాంటి ఆయింట్ మెంటో రాసుకోవాలి!...టిక్కెట్ తీసుకుని పోతూంటే పై నుంచి పెద్ద గేటు టిక్కెట్ కీపర్ గారు అరుస్తారు "గురో! అప్పుడే పాసింజెర్‌లని వొదలమాక..." లని...పాసింజెర్ లంటే ప్రేక్షకులన్నమాట.

కొన్ని సినిమా థియేటర్‌లలో బుకింగ్ కంత కన్నా సన్నంగా వుంటాయి. క్యూలో నిలబడి దూరే 'కంతలు' ... ఇందులోకి వెళ్లినవాడు టిక్కెట్ తీసుకుని బయటకు వచ్చేసరికి కనీసం ఓ పౌను బరువైనా తగ్గాలిసిందే... లోపల థియేటర్‌లో కెళితే కుర్చీలైనా బెంచీలైనా ఏవైనాసరే ఎంత 'బాక్సై'నా స్పెషల్ సర్కిల్ అయినా, ఏదైనాసరే కుర్చీలకు ఉమ్మడిచేతులే. ఓ "పాసింజెర్" చెయ్యి పెడితే రెండో ప్రేక్షకుడు మోచేత్తో పొడుస్తూంటాడు. నేనుకూడా టికెట్ కొన్నాను అన్నట్టు... రోజులు బాగుంటే మంచిదే లేకపోతే అటు సినిమా చూడబుద్ధికాదు యిటు మాట్లాడే దమ్ములుండవు... "ఇక ముందు సీట్లపై కాళ్లు పెట్టకుడు" అన్న స్లైడుకు ముందుగానే ముందుసీట్లమీద కాళ్లు పెట్టక తప్ప సంత యిరుగ్గా వుంటాయి వో వరుసకి మరో వరుసకిమధ్య... ఆలస్యంగా వచ్చిన ప్రేక్షకులు క్రిందకాళ్లను త్రొక్కుతూపోతారు. పైన వారి పృష్ఠ భాగాల్ని మొహాలదాకా తీసుకొనిరాక తప్పదు కనుక సీట్లోకూర్చున్నవాడుగూడా వూపిరిబిగించి మొహం అటు తిప్పి సగంలేచి దారివ్వాలి. అద్దె కొంపలో ఉమ్మడి నడవలాగా ఉంటుందాదారి. ఇక ఆడకూతుళ్లువస్తే యిలా లోపలికి పోవాలంటే ముందుసీట్లలోని వాళ్ల తలలూ, వెనుకసీట్లోనివాళ్ల మొహాలు తగలకుండా సగంచచ్చి, సామాన్యమైన మర్యాదస్తుణ్ణి సగంచంపి తమతమ స్థానాలలోకి పోవాల్సిందే... మరీ అన్యాయం 'పవర్ కట్' అయినా, సౌండ్‌కట్ అయినా, ఎక్స్‌ట్రా సీటైనా... ఏదైనా షరాలు రేట్లు మామూలే... అపునుమరి... ఆ ఎక్స్‌ట్రా సీటుకోసమే ఎమ్మెల్యేల రికమెండేషన్‌లు కూడా తెస్తారు జనాలు... ఏంటి చేస్తాం అంటారు తెలివైన ఎగ్జిబిటర్‌లు... అయ్యా అదీ సంగతి.



రావుగారు ప్రముఖ చిత్రకారులలో ఒకరుగా ఉండాలని, ఉంటారని ఆశించుచున్నాను ఈ చిత్రానికి గ్లాసు ఇంక్స్ వాడితే పత్రిక ఇంకా ఎంతో ఆకర్షణీయంగా ఉండేది

యస్. శాంతల, నల్లగొండ.

## ఉత్తరాలు

### కథలు

18—4—75 ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది. ఈ ఉగాది సంచికలో చాలా మంచి కథలున్నాయి. ముఖ్యంగా మూర్తిగారి "డాక్టరుగారి కూతురు" చాలా బాగుంది "వసంత—హేమంత" సీరియల్ మొదట్లోనే బాగుంది

నెమలికొండ రంజన్, సూర్యాపేట

# సినిమా

(30 వ పేజీ తరువాయి)

## పెరుగుతున్నాడు మళ్లీ పి. సి. రెడ్డి

"మానవుడు—దానవుడు", "బడిపంతులు", "ఇల్లు—ఇల్లాలు" చిత్రాలను ఎంచక్కా తీశాడు అనే పేరును సంపాయించుకున్నాడు పి. సి. రెడ్డి. ప్రేక్షకుల్లో ప్రత్యేకమైన స్థానం వుందనిపించుకున్నాడు. కానీ ఆమధ్య కొన్ని చిత్రాలు దెబ్బతిన్నాయి. పి. సి. రెడ్డి వర్తు తెల్సిన పరిశ్రమవాసులు అతన్ని ప్రోత్సహిస్తూనే వచ్చారు. అతను గూడా తన శక్తిపై ఆత్మాభిమానాన్ని పెంచుకుంటూనే వచ్చాడు.

అందుకు నిదర్శనంగా ఇటీవల విడుదలైన "పుట్టింటి గౌరవం", "కొత్తకాపురం" చిత్రాలు హవున్‌ఫుల్ కలెక్షన్స్‌తో నడుస్తున్నాయి. ప్రతి ఒక్కరినోటా పి. సి. రెడ్డి దర్శకత్వ ప్రతిభ ధ్వనిస్తూంది.

రాబోవు కిరణ్ వారి చిత్రం "బ్రతుకే ఒక పండుగ" నందినీవారి కొత్త చిత్రం, సుబ్బరాజుగారి "రక్తపాశం" పి. సి. రెడ్డి పలుకుబడిని మరింత ఇనుమడింపచేస్తాయి.

ఇప్పుడున్న పేరు, ప్రతిష్ఠలను మరింత పటిష్ఠం చేసుకునే విధంగా పి. సి. రెడ్డి కృషి చేయాలని ఆశిస్తున్నాను.

## నందమూరి నటనకు నీరాజనం!

సంసారం ఒక సముద్రం. అదొక సమస్యల వలయం. సంతోషాల నిలయం. మరియు సంఘర్షణల సంఘటితం. ఎంతో సహనం, సాధు స్వభావం లేనిదే ఆ సంఘర్షణలను ఎదుర్కోవడం కష్టం.



అనిల్ ప్రొడక్షన్స్‌వారు రంగుల్లో నిర్మించిన "సంసారం" చిత్రంలో హఠాత్సంఘటనలకు పాడలిపోక, బాధనంతా హృదయంలోనే దాచుకుని, నిబ్బరంతో, భార్యా, పిల్లలకు ధైర్యంచెప్పే ఒక గృహస్థుడిగా నటరత్న ఎన్. టి. రామారావుగారి నటన శ్లాఘనీయం. వారి సాంఘిక చిత్రాల్లో ఈ చిత్రం ఒక కలికితురాయి అవుతుందనడం నిస్సందేహం. వారి సతిగా జమున సలక్షణంగా చేసింది.

తాతినేని ప్రకాశరావుగారు ఎంత దీక్ష, దక్షతలతో పై చిత్రాన్ని తీర్చిదిద్దారో చిత్రం చూసినవుడనిపిస్తుంది. ఆద్యంతంవారి ప్రత్యేక దర్శక ప్రావీణ్యం కన్పిస్తుంది. వారి దర్శకత్వ విందుదవానికి తార్కాణంగా ఈ చిత్రం నిలుస్తుంది. టి. చలపతిరావు సంగీతం సూపర్ హిట్ పాటలందించిందన డానికి సాక్ష్యంగా "పాలిడార్" ద్వారా విడుదలైన ఈ చిత్రం పాటలు ప్రేక్షకుల పెదవులపై అప్పుడే పాపులర్ అయి, పుర్రయాత ఊగిస్తున్నాయి.

టి. ప్రకాశరావు నిర్మించిన ఈ చిత్రానికి టి. యల్. వి. ప్రసాద్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. తారకరామా ద్వారా ఈ చిత్రం నటరత్న జన్మదిన కానుకగా మే 28 వ విడుదలౌతుంది.

## మల్లెమాల తనయ వివాహం

సహజకవి మల్లెమాల సుందరరామిరెడ్డిగారి తనయ సౌభాగ్యవతి భార్గవి ఎం. ఎ. (ఫైనల్)కు, నెల్లూరు జిల్లా పరిషత్ మాజీ చైర్‌మన్ శ్రీ నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి తనయుడు చిరంజీవి రవీంద్రనాథరెడ్డి ఎం.ఏ.కు, ఏప్రిల్ 27 వ తేది మద్రాస్ ఎడ్వర్డ్ ఎలియట్స్ రోడ్డులోని రాజేశ్వరి కళ్యాణ మండపంలో వైభవంగా వివాహం జరిగింది. ఎందరో ఆప్తులు, ఆత్మీయులు, బంధుమిత్రులు వివాహానికి విచ్చేసి, వధూవరులను ఆశీర్వదించారు.

— శ్రీనివాస్



రామకృష్ణ, చంద్రకళ "అమ్మాయిల శపథం"లో



"రక్త సంబంధాలు"లో మంజుల

